# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

ఏప్రిల్ 1976

సంపుటము : 53 సంచిక : 4

విడిప్రతిక వెల రూపాయిన్నర

# సౌకర్యాల పథంలో చైతన్య రథం

ఆంధ్రప్రదేశ్‌లో 20 అంశాల ఆర్థిక కార్యక్రమం ఎంతో సమర్థవంతంగా, చురుగ్గా అమలు జరుగుతోంది. నిత్యావసర వస్తువుల సేకరణ, వాటి పంపిణీ బాగా ఎక్కువయ్యాయి. 1974–75లో మున్నెన్నడూ లేనంతగా 8.83 లక్షల టన్నుల ధాన్యం సేకరణ జరిగింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో 19,200 చౌక ధరల దుకాణాలు వున్నాయి. నిత్యావసర వస్తువుల ధరలు యిప్పుడు అదుపులో ఉన్నాయి.

భూ సంస్కరణల చట్టం రాష్ట్రంలో పటిష్ఠంగా అమల్లో ఉంది. బంజర్ల పంపిణీ క్రింద మొత్తం 18 లక్షల ఎకరాలు పంపిణీ అయ్యాయి. ప్రభుత్వ స్థలాలను అక్రమంగా ఆక్రమించిన దాదాపు 80 వేలకు పైగా ఆక్రమణదారులను ఆ స్థలాల నుండి ప్రభుత్వం ఖాళీ చేయించింది.

1975 ఏప్రిల్ 1వ తేదీ నుంచి తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదు కౌలుదార్ల రక్షణ చట్టం, వ్యవసాయ భూముల చట్టం క్రింద 81,872 మంది కౌలుదార్లకు రక్షణ కల్పించి, 3,99,26 ఎకరాలపై వారికి య జ మా న్య పు హ క్కు ను బదలాయింపు చేయడం జరిగింది.

స్వంత ఇళ్ళు లేని – బలహీన వర్గాలవారికి ఇళ్ళు నిర్మించుకునేందుకు ఒకొక్క కుటుంబానికి పల్లపు భూముల్లో అయితే 3 సెంట్లు మించకుండానూ, మెట్ట భూముల్లో అయితే 5 సెంట్లు మించకుండానూ ఉచితంగా ప్రభుత్వం పంపిణీ చేస్తోంది. సుమారు రూ. 10 కోట్ల విలువ మేరకు స్థలాలను సేకరించి 3 లక్షల కుటుంబాలకు పంపిణీ చేయాలని ప్రభుత్వ సంకల్పం. ఇప్పటికే 2.70 లక్షల పట్టాలు పంపిణీ అయ్యాయి.

ఏ వసతి లేని వ్యవసాయ కూలీలు ప్రయివేటు స్థలాల్లో ఇళ్ళు నిర్మించుకుని నివసిస్తున్నట్లయితే, వారికి ఆ యిళ్ళ స్థలాలపై యాజమాన్యపు హక్కు కల్పిస్తూ ప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీచేసింది.

గ్రామీణ ఋణాలపై మారిటోరియం విధించబడింది. దీనికి ప్రత్యామ్నాయంగా పరపతి సౌకర్యం కల్పించే వుద్దేశంలో సహకార పరపతి విధానాన్ని ప్రభుత్వం పటిష్ఠవంతం చేసింది. గత ఏడాది ఖరీఫ్ పంట కాలంలో రూ. 35 కోట్లు మాత్రమే తక్కువ కాల వ్యవధి ఋణాల క్రింద పంపిణీ చేయగా యీ ఏడాది ఖరీఫ్ పంటకాలంలో రూ. 52 కోట్లు పంపిణీ అయ్యాయి.

1975 ఏప్రిల్ 1 నుంచి సన్నకారు రైతులకు, అంతగా లాభసాటికాని వ్యవసాయం గల రైతులకు వ్యవసాయ పనులకోసం మొత్తం 4,10,582 మందికి రూ. 38 కోట్లూ, పాడి పశువులు, గొర్రెలు మొదలైన వాటి కోసం మొత్తం 36,220 మందికి రూ. 5 కోట్లూ పంపిణీ చేశారు.

చిన్న చిన్న వృత్తి పనివారు 35,374 మందికి స్వయం ఉపాధి పథకాలను చేపట్టే నిమిత్తం రూ. 5 కోట్లు ఋణాలు పంపిణీ చేశారు.

1975 డిసెంబరులో వ్యవసాయదారుల కనీస వేతనాలను ప్రభుత్వం హెచ్చించింది. ఈ హెచ్చింపు ఆడ, మగ కూలీలు యిద్దరికి సమానంగా వర్తిస్తుంది.

డైరెక్టర్,

సమాచార, పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

ఎం. నెం. 38/75–76

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1976


| | | |
|---|---|---|
| ఉండండుండండి ! | శ్రీ జె. ఎస్. ఆర్. కె. ప్రసాదరావు | 3 |
| ఆధునిక వ్యవసాయోత్పత్తి, పెరుగుదలలో పంటల భీమా పథకముల ప్రాముఖ్యత | శ్రీ అన్నపరెడ్డి కృష్ణారెడ్డి | 5 |
| ఆరాకుల చక్రం | శ్రీ మేకా సుధాకరరావు | 8 |
| "బాలవ్యాకరణము-త్రిలింగ లక్షణశేషము" | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | 9 |
| కార్తికస్నానం | శ్రీ వేలమూరి ప్రసాదరావు | 14 |
| జాతీయ సేవనా విధానము | శ్రీ ఇమ్మానేని సత్యసుందరం | 15 |
| రెండు కవితలు | "నిఖిల్" | 19 |
| మానస సరోవరం | శ్రీ పి. ఎస్. శాస్త్రి | 20 |
| తెలుఁగు పలుకు | శ్రీ బులుసు వెంకటేశ్వరులు | 22 |
| రాయనామ చరితావళి | డా. నేలటూరు వెంకటరమణ | 23 |
| నర్తించే చైతన్యజ్యోతి | 'రాగమాలిక రఘురూప' | 31 |
| భాషా, ప్రాసా, సామాజిక ప్రయోజనమూ కవిత్వంలో | శ్రీ నాగరాజు సురేంద్ర | 32 |
| వెన్నెల కుప్పలు | శ్రీ దిలావర్ | 34 |
| మధూకేశ్వరుని దేవి — వారాహి ? | శ్రీ జి. ఆర్. వర్మ | 36 |
| శృంగార నైషధ సర్వంకష | కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు | 41 |
| కలగూరగంప | | 53 |
| గ్రంథవిమర్శలు | | 61 |

# ఉండండుండండి!

శ్రీ జె. ఎస్. ఆర్. కె. ప్రసాదరావు

ఎవరక్కడ
అలా మీదిమీదికి రాకండి
మీరక్కడే ఉండి చూడండి

ఇదంతా మా వాకిలి
ఇదంతా మా లోగిలి

మేం గీచిన గిరి దాటకండి
మీ పునాదులను మీరే పెకలించుకోకండి

సనాతన సాంప్రదాయాలు
మా బూజు పట్టిన భావాలకు
ప్రతిరూపాలంటారా? అనండి మరి!—

మా ఎడదలలో పెరిగిన కఠిన శిలలు
వెయ్యిగొడ్డళ్లు పెట్టి కొట్టినా
ప్రక్కలు కారి అవి
మా అడ్డుగోడలు ఛేదించకండి

ఉండండుండండి!
మీ రక్కడే ఉండి పరికించండి

మా మాటల మూటలు విప్పి
మీ కనుకూల వ్యాఖ్యలు చేయకండి

మాలో బడభాగ్నులు నింపకండి
మేం పీల్చే గాలిని పీల్చకండి

మా నరనరాలలో నిర్మించుకున్న
సాంప్రదాయపు గూళ్ళను కూల్చకండి!

మేం చెప్పేదే వేదం
మేమే దేముళ్ళం

చట్టాలభయం పెట్టి మమ్ము
కటకటాలకు బందీలు కానీయకండి

ఎందుకు మా నీటిని అలా త్రాగుతారు
ఎందుకలా గుడ్లురిమి చూస్తారు

నాగరికతా వ్యామోహంలో
మా ప్రాచీనత్వాన్ని తగలేయమంటారా?

మాలోని జ్యోతులు ఇంతకన్నా వెలగవు
మాలోని కాంతులు ఇంతకన్నా చిందవు

ఓపిగుంటే మీరే—
మీలో ఒక్కరొక్కరే—ఇటొచ్చి
మమ్మల్ని తాకండి!

మా మసిబారిన హృదయాలను గీచి
తెల్లగా శుభ్రపరచండి

ఈ జగత్తంతా మీది నాదని
తరతమ భేదా లుండవని

కులం మతం ప్రసక్తేలేదని
కొత్త ఆలోచనా లోచనాలను
మా కళ్ళకు తగిలించండి

అప్పుడు ఈ లోకం పోకడ
ఎలా ఉంటుందో గమనిస్తాం

కొత్తబాటలో అందరితోబాటె
మేమూ పయనిస్తాం!!

# ఆధునిక వ్యవసాయోత్పత్తి పెరుగుదలలో
# పంటల భీమాపథకముల ప్రాముఖ్యత

శ్రీ అన్నపరెడ్డి కృష్ణారెడ్డి

భారతదేశ వ్యవసాయరంగము అనేక యిబ్బందులను యెదుర్కొనుచున్నది. అతివృష్టి, అనావృష్టి, వరదలు, తెగుళ్లు మొదలగు వాటివలన పంటలు నాశనమై రైతులు పలు యిబ్బందులకు గురియగుచున్నారు. ఈ యిబ్బందులు రైతులను బాధించడమేగాక, దేశ వ్యవసాయాభివృద్ధికి అవరోధముగావున్నవి. పైన ఉదహరించిన ఇబ్బందులు రైతుల ఆదాయమును తగ్గించుటయేగాక, ఆహారధాన్యాల కొఱతను మరింతగా పెంచుచున్నవి. వ్యవసాయోత్పత్తుల ధరలు పెరుగుటవలన వినియోగదారుని ఖర్చులుకూడ పెరుగుచున్నవి. వ్యవసాయముపై ఆధారపడిన పరిశ్రమలకు ముడి పదార్థాల కొఱత ఎక్కువై, ఉత్పత్తి కుంటుపడుచున్నది. ప్రకృతి వైపరీత్యములు వ్యవసాయరంగమును ప్రభావితముచేసినంతకాలము పేదరైతులు ఆర్థికముగా నష్టపడుటయేగాక వ్యవసాయకూలీలుకూడ పనిపాటలులేక సతమతమౌదురు. ఈ యిబ్బందులను తొలగించుటకు తీసికొనదగు యితర చర్యలతోపాటు పంటల భీమాపథకములను (Crop Insurance Schemes) దేశవ్యాప్తముగా అమలు జరుపుట ప్రధానాంశము. కొంతకాలము క్రిందట అప్పటి ఆర్థికమంత్రి శ్రీ వై. బి. చవాన్ సాధారణ భీమాకార్యనిర్వాహకులతో (General Insurance executives) ముచ్చటించుచూ వ్యవసాయరంగములో పంటల భీమా ప్రాముఖ్యతను నొక్కి చెప్పిరి. సన్నకారు రైతుల మరియు పేద రైతుల ఆదాయములు, పైన తెల్పిన వైపరీత్యములవలన తగ్గిపోకుండ రక్షించుటకు పంటల భీమా పథకము ఎంతగానో ఉపకరించును. దీనిని గుర్తించి ప్రభుత్వము ఈ సమస్యా పరిష్కారమునకు, పంటల భీమాపథకములను రూపొందించు విధానమును పరిశీలించుటకు సాధారణ భీమాసంస్థ కార్య నిర్వాహక సంఘ సభ్యులతో నొకకమిటీని ఏర్పాటుచేసినది. ఈ కమిటీ ప్రస్తుతము పంటలకై ఉపయోగించబడిన ఉత్పాదకముల (Inputs) ఆధారముగా కొంత ఉత్పత్తికి హామీ కల్పించుచున్నది. ఈ పథకము క్రింద ప్రస్తుతము ప్రత్తి, వేరుశనగ పంటలు వచ్చును.

పంటలభీమాపొందుటవలన రైతులకు పంటలమీద ఆర్థికముగా నష్టము రాగలదనే భయము తొలగును. పంటలభీమా పొంద దలచిన ప్రతిరైతు కొంత మొత్తమును ప్రీమియముక్రింద సాలుసరి భీమా సంస్థకు చెల్లించవలయును. ఏదేని ప్రమాదము జరిగి పంటలు నాశనమగుచో భీమాసంస్థ నష్టమును అంచనావేసి, నష్ట పరిహారము రైతునకు చెల్లించును. కాబట్టి పంటలభీమా అతివృష్టి, ఈదర గాలులు, మొక్కలతెగుళ్లు, అగ్నిప్రమాదము గాలివాన మొదలగు ఆపదలవలన కలుగు నష్టములనుండి ప్రతిరైతును రక్షించును. దీనివలన వ్యవసాయపు ఆదాయస్థిరీకరణకూడ జరుగును.

## పంటల భీమావ్యాప్తి — భారతదేశము

పంటల భీమాను అమలుపరచు ఆలోచన సుమారు మూడు

దశాబ్దముల క్రితము కలిగినప్పటికీ, యిప్పుడిది భారతదేశములో ఒక నూతన ప్రయోగమనే చెప్పవచ్చును. కాని ఇతరదేశములలో చాల కాలము నుండి ఈ పథకములు అమలులో ఉన్నవి. ప్రప్రథమముగా క్రీ. శ. 1788లో ఫ్రాన్సు దేశములో వ్యవసాయరంగములో భారీఎత్తున పంటలు నాశనమయినప్పుడు, శ్రీ బెన్‌జమిన్ ఫ్రాన్‌క్లిన్ [Benjamin Franklin] పంటల భీమాను గూర్చిన సలహా ప్రభుత్వమునకు యిచ్చెను. అమెరికా, రష్యా, కెనడా, జపాన్, శ్రీలంక, జమైకా, బ్రెజిల్‌లాంటి దేశముల జాతీయ ఆర్థిక వ్యవస్థలో పంటల భీమా ప్రముఖ స్థానమును ఆక్రమించుచున్నది. రష్యాలో ఈ పథకములు, స్టేట్ ఇన్‌సూరెన్స్ అడ్మినిస్ట్రేషన్ [State Insuranc Administration] ఆధ్వర్యమున జరుగుటయేగాక, అనివార్యము [Compulsory] కూడా చేయబడినది. అమెరికాలో యిది పూర్తిగా ఐచ్ఛికముగా అమలు జరుపబడుచున్నది. ఫెడరల్ క్రాప్ ఇన్‌సూరెన్స్ కార్పొరేషన్ అనెడి శాఖద్వారా [Federal InsuranceCorporation] పథకములు అమలు పరచబడుచున్నవి. జపాన్‌లో సహకార సంఘములు, ఐచ్ఛిక సంఘములు మరియు ప్రభుత్వముల సమష్టి కృషిద్వారా పంటల భీమా పథకములు రూపొందుచున్నాయి. ఈ పథకములద్వారా రష్యాలో అన్ని పంటలకు రక్షణ యివ్వగా. అమెరికాలో గోధుమ, ప్రత్తి పంటలకు, జమైకాలో చెరకు, అరటిలాంటి వాణిజ్య పంటలకు, బ్రెజిల్, జపాన్‌లలో కొన్ని ముఖ్యమైన పంటలకు రక్షణ యివ్వబడుచున్నది. శ్రీలంకలో క్రీ. శ. 1961వ సంవత్సరములో అమలులోనికి వచ్చిన క్రాప్ ఇన్‌సూరెన్స్ చట్టము [Crop Insurance Act] క్రింద పంటలభీమా పథకములు నడుచుచున్నవి. 1966–67లో ఈ పథకముల రక్షణక్రింద 2 లక్షల ఎకరముల భూములున్నవి.

మన దేశములో 'రబ్బరు బోర్డు' వారికృషి ఫలితముగా రబ్బరు తోటల పరిశ్రమకు పంటలభీమాక్రింద రక్షణ లభించినది. ముఖ్యముగా అగ్నిప్రమాదము, గాలి, వరదలవలన రబ్బరు తోటలకు నష్టములు సంభవించును. రబ్బరుచెట్ల జీవిత కాలములో (25 నుండి 30 సం.) అగ్నిప్రమాదము, గాలి, వరదల వలన మొత్తము పెట్టుబడిలో 7.5% నష్టము కలుగుచున్నదని రబ్బరు బోర్డువారు చేసిన ఒక పరిశీలనద్వారా తేలినది. అయితే యీ మాదిరి క్రమపద్ధతిలో నడిచే పథకములు, సాధారణ పంటల భీమాపథకములుగా రూపొందించు ప్రయత్నములు కన్పించుటలేదు. మొదటిసారిగా క్రీ. శ. 1943లో నిరాటంకముగా సాగు అనివార్య పథకములు అమలుజరుప ప్రయత్నించబడినది. తరువాత క్రీ. శ. 1948 సం. లో శాస్త్రీయ పద్ధతిలో ప్రత్యేకాధికారి డాక్టర్ జి. యస్. ప్రియోల్కర్ [Dr. G. S. Priolkar] ఆధ్వర్యమున కూలంకషముగా, దేశ వ్యాప్తముగా వీటిని అమలుపరచుటకు పరిశీలన జరిగినది. ఈ పరిశీలన పంటల భీమాపథకములను వరి, గోధుమ, ప్రత్తి, చెరకు పంటలకు వర్తింపజేయవలయునని సిఫార్సు చేసినది. క్రి. శ. 1961 సం.లో పంజాబ్‌లో ఈ భీమాపథకములు 'పైలట్' పథకములుగా [Pilot schemes] అమలులోనికి వచ్చినవి. వీనిక్రింద 6 జిల్లాలలోని, 100 గ్రామములు ఈ సౌకర్యమును పొందినవి. కాని రైతులనుండి సహకార లోపముచేతనూ, సాంకేతిక పరిశీలనలేని కారణముగానూ పైలెట్ పథకములు ఎక్కువ కాలము కొనసాగలేదు.

## ప్రణాళికాబద్ధమైన ప్రయోగములు

ఇప్పుడు సాధారణ భీమాసంస్థ [General Insurance Corporation] పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, గుజరాత్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రములలో ప్రవేశపెట్టుటకు పంటలభీమా పథకములను రూపొందించుచున్నది. ఈ రాష్ట్రము లన్నియూ అభివృద్ధికి కావలసిన అవస్థాపన, ఉత్పాదకములు మొదలగునవి కలిగియున్నవి. ఈ పథకముక్రింద భారత ఎరువుల సంస్థ [Fertiliser Corporation of India] యొక్క సహాయ సహకారములతో పశ్చిమ బెంగాల్ రాష్ట్రములో భీమాపథకములు అమలు జరుగుచున్నవి. ఫర్టిలైజరు అండ్ కెమికల్ ట్రెవాన్‌కూర్ లిమిటెడ్ [Fertilizer and Chemical Travancore limited,] ఇ. ఐ. డి ప్యారి [E. I. D. Parry] సంస్థల సహాయమును ప్రస్తుతము తమిళనాడు రాష్ట్రము పొందుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్తి, వేరుశనగ పంటల భీమాపథకముల అమలుకు ఇ. ఐ. డి. ప్యారి సంస్థ చేయూతనివ్వగలదు. ప్రత్తిపంట భీమాకు మాంగలూర్ కెమికల్ & ఫర్టిలైజర్స్ లిమిటెడ్ [Mangalore Chemical & Fertilizers limited] పూర్తిసహాయమును అందించగలదు. ప్రత్తిపంటను భారీఎత్తున పండించే మహారాష్ట్ర, తమిళనాడు రాష్ట్రములు ప్రత్తిపంట భీమాలో అగ్రస్థానము ఆక్రమించుచున్నవి. ఇప్పటికే గుజరాత్ రాష్ట్రము అధికోత్పత్తినిచ్చు ప్రత్తి–4రకము పంట భీమా విషయములో పైలెట్ పథకము అమలుపరచుచూ ముందడుగు వేయుచున్నది. ఈ పథకమునకు స్టేట్ ఫర్టిలైజర్ కంపెనీ లిమిటెడ్ [State Fertiliser Company limited] అవస్థాపన సౌకర్యములు, బ్యాంక్ ఆఫ్ బరోడా [Bank of Boroda] ఆర్థిక సౌకర్యములు కల్పించుచున్నవి. అద్యతన భావిలో వనస్పతి మాన్యుఫాక్చర్స్ అసోసియేషన్ (Vanaspati Manufacturers Association) సహాయముతో గుజరాత్ రాష్ట్రములో వేరుశనగ పంటకు కూడ వర్తింపచేయబడగలదు.

## ఇబ్బందులు—సలహాలు

కేంద్ర ప్రభుత్వము దేశవ్యాప్తముగా పంటలభీమా అమలుకు

మూడవ ప్రణాళికలో రూ 40 లక్షలు కేటాయించి నాంది పలికినది. కాని భీమా వ్యాపారమును పూర్తిగా కేంద్రప్రభుత్వము చేపట్టుడ ముతో రాష్ట్ర ప్రభుత్వములు వీనిని అమలు పర్చజాలకపోయినవి. ఈ పథకములను రాష్ట్ర ప్రభుత్వములు సులభముగా అమలుపరచు టకు వీలుగా కేంద్ర ప్రభుత్వము శాసనములను సవరించవలయును.

వ్యావసాయిక విషయములకు సంబంధించిన సవివరమైన సమాచారలోపము పెద్ద ఆటంకముగా ఉన్నది. పంటలభీమా పథక ములు అమలుకు రాకమునుపే వ్యవసాయ విస్తీర్ణము, ఉత్పాదకముల వ్యయము (Cost of inputs) సాలుసరి సగటుపంట, నీటిపారుదల సౌకర్యములు, పంటల నాశనమునకుగల కారణములు మున్నగు విషయ ములపై అంకెలను సేకరించుట ఎంతో అవసరము. అవసరమైతే విషయసేకరణకు తగిన యంత్రాంగమును ఏర్పాటు చేయుటకు ప్రభుత్వము సత్వర చర్యలు గైకొనవలయును.

పంటల భీమాపథకములు జయప్రదమగుటకు రైతుల నిరక్ష రాస్యత ఎంతవరకు అవరోధమో ఆలోచింపవలసిన సమస్య. విద్యావంతు లైన రైతులు మాత్రమే ఈ పథకములను ఆదరించగలరను వాదము ఒకటున్నది. శైశవదశలో విద్యావంతులు ఆదరించినప్పటికీ, ఈ పథకముల ప్రయోజనములను ప్రచారముచేసినచో అవిద్యావంతులు గూడ తెలిసికొని వాటి అమలుకు తప్పక సహాయపడగలరు. ఈ విషయ ములో ముందంజవేసి పథకములను ప్రవేశపెట్టి రైతువర్గములలో విశ్వాసమును కలిగించవలసిన బాధ్యత సాధారణ భీమాసంస్థపై ఎంత యినా వున్నది.

ప్రస్తుత వ్యవసాయ మార్కెటులో ధరలస్థిరీకరణ లేదు. ముఖ్యముగా ఆహారధాన్యముల ధరలు చాలత్వరితముగా మార్పుచెందు తున్నవి. రైతులకు లాభదాయకమైన ధరలకు హామీనిచ్చు విధముగా మార్కెట్ సౌకర్యములు కల్పించవలయును. ఈ లక్ష్య సాధనకు వ్యవ సాయ రంగములో సంఘటిత మార్కెట్ల ఏర్పాటు ఎంతో అవసరము.

వ్యవసాయరంగములో యాంత్రికీకరణజరిగినపుడే అధికోత్పత్తిని సాధించగలము. అలాగే ఉత్పత్తి ఖర్చులను తగ్గించి, అధికరాబడుల సాధనకు, రైతులకు క్షేత్ర నిర్వహణాజ్ఞానము ఎంతో ఆవశ్యకము. కావున వ్యవసాయములో ఎక్కువగా యంత్ర సామగ్రిని వాడుట, క్షేత్ర నిర్వహణ, బడ్జెటింగ్ మొదలగు విషయాలలో రైతులకు శిక్షణ యిచ్చుట అవసరము. శిక్షణ యిచ్చుటకు శిక్షణా శిబిరములు నెలకొల్పవలయును. ఆర్థిక సంస్థలు మార్కెటింగ్ సంస్థలు ప్రభు త్వము వీటిమధ్య సమన్వయము ఉన్నచో రైతులకు ఆర్థికముగా తోడ్పడి, వారిని వడ్డీవ్యాపారస్థులబారినుండి తప్పించవచ్చును.

పథకముల నిర్వహణకు భూకమతముల పరిమాణముకూడ కొంత ఆటంకముగాఉన్నది. 1961–'62లో 17వనేషనల్ శాంపుల్ సర్వేవారు చేసిన లెక్కల ప్రకారము ఇండియాలో సగటు భూకమత ముల పరిమాణము 2.63 హెక్టార్లు. చిన్నకమతములమీద వ్యవ సాయపు ఆదాలు తక్కువ. ఖర్చులు ఎక్కువ. నష్టములుకూడ చాల ఎక్కువగా కలుగుటకు వీలున్నది. సన్నకారు రైతులు ప్రీమియం మొత్తములు సకాలములో చెల్లించగలరనే నమ్మకము తక్కువగా వున్నది. చిన్నకమతముల సంఖ్య ఎంతో తెలిసికొనుటకు ప్రభుత్వము సత్వర చర్యలు తీసుకొనవలయును. సన్నకారు రైతుల యిబ్బందులను తొలగించుటకు ప్రభుత్వము మరింత బాధ్యతను భుజస్కంధములపై వేసుకొనవలయును. రైతులు చెల్లించు ప్రీమియములో కొంత భాగము ప్రభుత్వము భరించవలయును.

ఋణాలు మంజూరుచేయు ప్రాంతములో పంటల భీమాపథకము లను విస్తృతపరచినచో ఎక్కువ ఫలితములు రాగలవు.

వ్యవసాయ ప్రముఖులు, విస్తరణాధికారులు, బ్యాంకింగ్ ప్రముఖులు, వ్యవసాయదారులు మొదలగువారితోకూడిన స్థాయీ సంఘములను ఏర్పాటుచేయవలయును. ఈ సంఘములు క్రింది విధులను నిర్వహించవలయును:

(ఎ) ప్రీమియము చెల్లింపులు; క్లెయిములు నిర్ణయించుట;

(బి) ప్రారంభములో పథకముల నిర్వహణను పరిశీలించుట

(సి) పథకములు జయప్రదమగుటకు యితర సలహాలు ప్రభు త్వమున కిచ్చుట.

ఇవిగాక, ఋణ విముక్తి, భూమిశిస్తు తగ్గింపులు, నీటి పారుదల సౌకర్యములు, క్షేత్రపరిశోధన, గ్రామీణ ఋణ సౌకర్యముల పెంపుదల మొదలగు విషయములలో ప్రభుత్వము శ్రద్ధవహించి అనేక చర్యలు తీసుకొనవలయును. ఆధునిక వ్యవసాయరంగములో పంటల భీమా ప్రముఖస్థానమును కలిగియుండుటయేగాక, రైతుల ఋణశక్తినిపెంచి, వారి ఉత్పత్తి విక్రయములలో బేరమాడుశక్తిని పెంచగలదు.

ఈ పథకములు జయప్రదముగా కొనసాగుటకు, అటు ప్రభుత్వ యంత్రాంగములోనున్నవారికి, ఇటు వ్యవసాయదారులకు ఐకమత్యము, చిత్తశుద్ధి, విశ్వాసము, బాధ్యత, పరస్పరసహకారము అత్యంతావశ్యకమైన వనుటలో సందేహములేదు.

# ఆరాకుల చక్రం

## శ్రీ మేకా సుధాకరరావు

కోటి చుక్కలు పూయించుకుని
నీటుగా కులుకుతున్న నింగితో పోటీపడి
శత కోటి సుమాలు అలరించుకుంది, అవని—
శోభన వధువులా ! షోకేలా మగువలా !!

నింగి తల్లికి జరిగిన అవమానానికి
ఉగ్రుడైన సూర్యుడు
ధరణిని దాహంతో మాడ్చాలని
అవనీతల జలమంతా ఆపోశనం పట్టేశాడు—
గోదావరి మేలేసుకు పోయో !
గోమాతల పొదుగు లెండిపోయేలా !!

పొట్ట బరువెక్కిన జలద భాండాలు మత్తుగాని
మసకబారిపోయింది, లోకం !
తూలుతూ పోయి నిదురపోతూన్న
కొండలను గుద్దుకుని బద్దలై
నేల పాలయింది, జీవనం—
పుడమి తల్లి ఒడలు
పులకరించి మొలక లెత్తేలా !
ఎండిపోయిన నదులు
వరదలై పొంగి పారలేలా !!

వినీల నీరద అనీల జలాల
సుస్నాతయైన వనసుందరి వదనంలా;
మబ్బుపొగల మసగేసుకు పోయిన చంద్రమా ను ముఖం
స్వచ్ఛంగా—వెన్నెల పసందుగా—విందుగా
కళకళలాడుతూంది—

విద్యుల్లతా విలసనంలా ! లావణ్యాల లాస్యంలా
వియత్తలంనుంచి వినూత్నకాంతులు కురిసే
వెన్నెల కన్నె సోయగానికి
వెర్రెత్తిన ఘనీభశీతలుడు
విరహతాపంతో కరిగిపోయి
పొగలు చిమ్ముకుంటూ వెంబడించి
కర్కశ కౌగిలిలో
బలవంతంగా బంధించాడు—
వృద్ధులుస్సైతం స్పందించేలా !
సిద్ధులుకూడ చలించేలా !!

బిగి చలి కౌగిలిలో
రాలిన చేమంతి రేకులు మిగిల్చిన
జడలోని తొడిమలా—
రాలిపోయిన ఆకులు మిగిల్చిన
వృక్షసంతతి జడిమ—
కడతేరని కష్టాల, మోడువారిన
సామాన్యుని బ్రతుకు గోడులా !
ఆశలన్నీ కూల్చుకున్న రోగిలా !!
కర్మలన్నీ రాల్చుకున్న యోగిలా

ఈ చక్రం
అలానే తిరుగుతూ—ఆకులు మారుతూ
దిగంతాలలోనూ
యుగయుగాంతాలలోనూ
అనంతం సాగుతూనే ఉంది !!

---

# "బాలవ్యాకరణము - త్రిలింగలక్షణ శేషము"

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

### (గతసంచిక తరువాయి)

"అనేక కర్తృక క్రియ" కను సూత్రమునుగూర్చి నేను వ్రాసినపుడు, "అగు నని సూత్రమున నున్నంతమాత్రమున నది నిత్యవిధియని భావింపరా" దని పాతకోటవారు తమ పొల్లుమాటలకు బలిమి కలిగింప సూరి రచించిన "కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" నను సూత్రము చూపిరి. ఆ సూత్రమున "అగు" నని యున్నది కదా! కావున నా సూత్రకార్యము నిత్యమని నేనంటిని. పేర్వాదులలో నుత్తున కచ్చు పరమయినపుడు టుగాగమము నిత్యము గాకుండుటచే సూరియే "కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు" నని సూత్రము రచించెనని వ్రాసితిని. అగునన నిత్యవిధిగాదని నెఱ నమ్మిన రాధాకృష్ణమూర్తిగారు పయి రెండు సూత్రములకు, వ్యాకరణ సంప్రదాయమును విస్మరించి తమ యిష్టము వచ్చినట్లు వ్యాఖ్యానము చేసిరి. నవంబరు "భారతి" లో వారు వ్రాసిన వ్రాత లెట్టివో చూడుఁడు.

"కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు. ఇది నాగళ్లవారి మతమున వారు చెప్పినట్లు సంజ్ఞా — పరిభాషా—విధి—నియ—మాతిదేశాధికారములలో నే తెగకుఁజెందునో? విధి యన్నచో బ్రక్కలెముక యిత్యాదులు సాధువులు గానేరవుగదా? కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు ననునది విభాషకే యన్వయించునా? ఈ సూత్రముచే నుదంత స్త్రీసమముల కొన్నింటిమీఁదనే యచ్చులకు టుగాగమము విభాషగానగు. కాని పుంపులమీద నిత్యమనిపించును. సరసపుటలుక — సముద్రపుటొడ్డు మున్నగునవి. మరి యిప్పుడు సూత్రమున విభాషయనునది సార్థకమా? దీని నేమనవలె?

పాతకోటవారి పలుకుల కేమనవలె? వారు అగునన సూత్రకార్యము నిత్యముగాదని తలంచి యొక పెద్దతప్పు చేసిరి. ఆ తప్పును సమర్థించుకొనుటకో లేక కప్పిపుచ్చుకొనుటకో పడరానిపాట్లు పడుచున్నారు. బోడితలకు మోఁకాలికి ముడిపెట్టినట్లు పేర్వాదుల సూత్రమునకు, సరసపుటలుక మున్నగు లక్ష్యములకు ముడిపెట్టుచున్నారు. కర్మధారయాదులలోఁ బుంపుల కచ్చు పరమైనపుడు టుగాగమము నిత్యమనియే సూరి సంప్రదాయము. ఆయన యాంధ్ర శబ్దానుశాసనములో స్పైతము "పుంపులకు నిత్యంబు" అని నిర్ద్వంద్వముగాఁ జెప్పెను. కావుననే సరసపుటలుక యను లక్ష్యమున నిత్యవిధియగు "కర్మధారయంబులం దుత్తున" కను సూత్రము క్రిందఁ జూపెను. పేర్వాదుల సూత్రమునకు, నా లక్ష్యమున కెట్టిపొత్తు లేదు. "మరి యిప్పుడు సూరి సూత్రమున విభాషయన్నది సార్థకమా?" యను పాతకోటవారి ప్రశ్నము వ్యర్థము. అది వారి బూకరింపులకు మచ్చుతునుక. పేర్వాదుల సూత్రమునందలి విభాషాపదము సర్వవిధముల సార్థకము. అది ప్రాప్తవిభాషయని రాధాకృష్ణమూర్తిగారికిఁ దెలియదు. ఏసూత్రముచేనైన నిత్యముగాఁ బ్రాప్తించు కార్యమును వికల్పముగా విధించునట్టిది ప్రాప్తవిభాష యగును. "కర్మధారయంబులం దుత్తున" కను సూత్రముచే నిత్యముగా నగు టుగాగమము "కర్మధారయంబునఁ బేర్వాదుల" కను సూత్రముచే వికల్పితమగుచున్నది. కాన యా సూత్రమునందలి విభాష ప్రాప్తవిభాష యగును. ఈ రహస్యము తెలియని రాధాకృష్ణమూర్తిగారు వ్యాకరణ వేత్తవలె నభినయించుచు వంకరవ్రాఁతలు వ్రాసిరి.

"కర్మధారయంబులం దుత్తున" కను సూత్రమున "అగు" నిత్య విధిని నిరూపించును. ప్రక్కలెముక మున్నగువానికి, నా సూత్రమునకు సంబంధములేదు. సంబంధమున్న దనుట సూరి సంప్రదాయమునకు వ్యతిరేకము. పల్లెటూరు మున్నగువాని మూల తత్త్వమును రాధాకృష్ణమూర్తిగారు ముట్టలేదు. ఆంధ్రవ్యాకరణ వేత్తల యభిప్రాయము లాలింపలేదు. ఆపని యదృష్ట వశమున నా

కప్పగించిరి. సూరిసూత్రములకు వంకలొత్తు సీతారామాచార్యుల వారు పల్లెటూరు మున్నగు వానిని త్రిలింగలక్షణ శేషమున సాధింప లేదు. అది యాచార్యులవారి దోష మని నే ననుటలేదు. వారు శబ్ద రత్నాకరమున దుక్కిటెద్దు,—పడుకటిల్లు, తేనెటీఁగ యను వానిని మాత్రమే స్వీకరించిరి. స్వీకరించియుఁ బ్రయోగములు చూపరైరి. పల్లెటూరు, పక్కటెముక యనువానిని వదలిరి. మిద్దెటిల్లు ప్రత్యే కముగాఁ జూపరైరి. గుప్తార్థప్రకాశికా కర్తయుఁ గావ్య ప్రయోగ ములు చూపలేదు. వీనికిఁ గావ్య ప్రయోగములు లేవా ? ఒక కొన్ని టికి మాత్రమే యున్నవి. వానిని వరుసగాఁ జూపుదును.

"పల్లనాటిసీమ పల్లెటూళ్లు" అని శ్రీనాధుని చాటువు— "కోరినయన్ని దుక్కిటెద్దుల బల్మితోడనిచ్చు" అని విలాసుందరీ పరిణయము— "గొఱియలమంద, యాఁబసుల గుంపు, కృషిక్రియ దుక్కిటెద్ల" అని వేంకటనాధుని సంచతంత్రము—దుక్కెద్దు అని ప్రామాణిక కవిప్రయోగమును గలదు ."...దుక్కెద్దు దేశాంతర, మరిగినట్లగు"నని భోజరాజీయము—"పాపజవరాలి బంగారు పడుక టిల్లు "అని విజయవిలాసము—పడుకిల్లు రూపమును గలదు. "బయలు నవ్వుచుఁ బడుకిండ్లు వాచికొనుచు" అని దశకుమార చరిత్రము. "అంతటఁ దెల్లవాఱిన లతాంగి నను౦ బడుకింటి మిద్దెపై"నని శుకస్తతి—నేను జూచిన కవిప్రయోగము లివియే. "మిద్దెటిల్లు" "పక్కటెముక" పాతకోటవారికిఁ గనబడిన, నవియొక ప్రామాణిక కవివి యైనఁ దప్పక నేనొప్పుకొందును.

ఇఁక వీనిని గూర్చి వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారేమనిరో చూతము. వారు

"తేనెటీఁగ—దుక్కిటెద్దు—పల్లెటూరు—మిద్దెటిల్లు మున్నగు వ్యావహారిక శబ్దములం దీ టుగాగమము కన్పట్టుచున్నది. ఇట్టివానికి నిరాధారముగాఁ గోశకర్తలు గ్రాంథికత నంగీకరించుట యుక్తమని తోఁపదు...కోశకారు లిచ్చిన ప్రయోగములలోని టుగాగమము యతి ప్రాసాది స్థలఖచితము కామింజేసి యట్టియెడ తేనెయీఁగ—దుక్కి యెద్దు మున్నగు రీతిని నిల్పినను క్షతి యేమియులేదు. తుది కాంధ్ర భాషార్ణవమందు సైతము తేనెటీఁగ యనునది పేర్కొనఁబడలేదు. [అందుఁ దేనీఁగయని మాత్రమే స్వీకృతము| ప్రామాణికకవి ప్రయో గముగాని, ప్రామాణిక నైయాకరణ వచన ప్రామాణ్యముగాని లేన పుడు వ్యావహారిక శబ్దములకు గ్రాంధికత నంగీకరించుట సంప్రదాయ విరుద్ధము"

అని వ్రాసిరి. దుక్కిటెద్దు మున్నగువానిని దారకాణించి పాత కోటవారు సూరి రచించిన "కర్మధారయంబులం దుత్తున" కను సూత్రము నందలి "అగు"నకు నిత్యవిధిగా దని యర్థము చెప్పుట పొసగదు. చెప్పిన సూరి సూత్రరచనా పద్ధతికి విరుద్ధమగును. "....పూర్వరచనములలోఁ దాను సేకరించియుంచిన విషయము లన్నిం టిలో ముఖ్యములు, అవశ్యజ్ఞాతవ్యములు నిష్కృష్టములు, నిరంత రావశ్యకములు నగు ప్రధాన విషయము లెన్నుకొని" "సంగ్రహ రూప మున బాలవ్యాకరణము" రచించిన సూరిసూత్రమునకు వెలియయిన పల్లెటూరు మున్నగు లక్ష్యములను వదలుట వింతగాదు. కాన రాధా కృష్ణమూర్తిగారు "కర్మధారయంబులం దుత్తున" కను సూత్రము "విది యన్నచోఁ బక్కటెముక యిత్యాదులు సాధువులు గానేరవు కదా?" యని ధీరముగాఁ బ్రశ్నించుట వ్యర్థము.

పాతకోటవారు వాదమును వక్రమార్గము పట్టింతురని వ్రాసి తిని. తద్భవముల విషయమున వారు వ్రాసిన వ్రాఁతలే దీనికి సాక్ష్య ములు. తద్భవములం దలఘురేఫము కలదని యాచార్యులవారనిరి. సూరి యీ సత్యము గుర్తించెనని నిఘంటు ప్రమాణము చూపితిని. అహోబల పండితుని వాక్యము లుద్ధరించితిని. ఇప్పట్టున రాధాకృష్ణ మూర్తిగారు సూరి తనకుఁ దెలిసిన విషయమును బాలవ్యాకరణమున సూత్రబద్ధముగాఁ జేయలేదేమి? యని ముందు ప్రశ్నించిరి. అహో బలుఁడు చెప్పినంత మాత్రమున నంగీకరింపవలయునా? యని బీభిషి కలు కొట్టిరి. "వారు ప్రయోగ మొక్కటియైనను౦ జూపినారా? పోనీ ప్రసాదరావుగారైనను౦ జూపినారా ? మహాకవి ప్రయోగము చూపక," నేను జెప్పితిని నీవు వినవలె ననుట తగునా?" యని బరవసముతోఁ బలికిరి.

పాతకోటవారు పలుకుచున్న "నేను జెప్పితిని, నీవు వినవలె" నను విధానము ప్రథమ ద్వితీయాచార్యుల వ్యాకరణములందే యున్నదే! ఆంధ్రశబ్ద చింతామణి, వికృతివివేకము నే లక్ష్యములు చూపి లక్షణ ములు స్థాపించినవి? మూర్తిగారి సూక్తిని మూడలగాఁ గొనిన నా రెండు వ్యాకరణములు విలువ లేని వగును. అదియునుగాక పాత కోటవారు "పడు" ధాతువునకు "దిగు" అని యర్థమును నిపుణ ముగా నిర్ణయించిరి గదా! వారే కవిప్రయోగము చూపి యీ లెన్ను వట్టిరి.

పాతకోటవారి వాదము చేవచచ్చినట్టిది. అహోబల పండి తుని మాటల యధార్థములని వారు భావింపవచ్చు. కాని దానికి హేతు వులు వారు చూపవలయును. ఆ పని వారు చేసిరా? చేయలేదు. సూరినిఘంటు ప్రమాణము నిలువదని వారు తలంచిన నుపపత్తులు చూపవలయును. చూపిరా? లేదు. కవిప్రయోగములు కావలయునని బూకరించిరి. దానిమీఁద నేను నిఘంటువులోఁ జెప్పిన విషయమును

సూరి బాలవ్యాకరణముఁ జెప్పక, తద్వ్యతిరేకముగా వక్కాణించుటకు హేతువులు వంతరాం రామకృష్ణారావుగారి పలుకులలోఁ జూపితిని. కవిప్రయోగములు చూపితిని. ఇఁక నవంబరు "భారతి"లో వైయాకరణ శిరోమణి యగు మూర్తిగారు.

"ఈ శబ్దము తద్భవమని—యిందలిది శకటరేఫమని నిష్కర్షగా నిరూపించు లక్షణము లేదని విజ్ఞులెఱిఁగినదే"

యని యొక మెట్టుక్రిందికి దిగి వ్రాసిరి. వా రహోబల పండితునిపై నభియోగము తెచ్చినపు డీవిజ్ఞత యేమయ్యెను? అప్పుడు కవిప్రయోగములు కావలయునని ఘోషించు టేల? కవిప్రయోగములు చూపిన నిప్పు డీమాటలు వ్రాయు టేల? ఈ పెడసరము నేమనవలె ? కవిప్రయోగములు కంటగింపులు కాఁగా, నోటమి యంగీకరింపక పాతకోటవారు పలుకుమాటలు గావా యివి?

ఈ శబ్దము తద్భవమని, యిందలిది శకటరేఫమని నిష్కర్షగా నిరూపించు లక్షణము లేదని రాధాకృష్ణమూర్తిగారు రాద్ధాంతము చేసిరే! అట్లయిన నిన్నివందల యేండ్లనుండి యెందఱో విజ్ఞులు తద్భవ శకటరేఫముల విషయమునఁ జేసినకృషియెల్ల దేనికిఁ బనికిరాని దగునే! పండిత ప్రకాండు లామహామహులు లక్ష్య లక్షణవేత్తలే! కారణములు చూపక వారిమాటలు కాదనఁదగునా? చివరకు బాతకోటవారెట్లు బరితెగించిరో పరికించితిరా! ప్రక్కదారులుపట్టిన పాతకోటవారు తాము చెప్పెడు తప్పుమాటల కాచార్యులవారు బలి యగుచున్నారని గ్రహించిరా?

ఆచార్యులవారు "తద్భవములందును నలఘురేఫము గలదు" "కోటపేఁటలు వైకృతములు" కపిలశబ్ద భవము కవిలశబ్దం బొందు గానం బడెడి"నని ప్రవచించిరే! ఆ లక్షణములు గంగలోఁ గలపవలయునా? మొద లహోబల పండితు నభిశంసించిన మూర్తిగారు తుద కాచార్యులవారి కెసరువెట్టిరి!

పాతకోటవారి మాటలు ప్రమాణములయిన, నాంధ్ర వ్యాకరణవేత్తలు, నాంధ్రనిఘంటుకారులు తద్భవములని, శకటరేఫ ఘటితములని చూపినపదములనెల్ల రూపుమాపవలయును. పాతకోటవారివలె వ్యాకరణము చదివినవారు తప్ప, దానికి విజ్ఞులెవ్వరు నంగీకరింపరు, అంగీరింపరాదు. ఆచార్యులవారు తద్భవములుగాఁ జూపిన పదములలో గొఱ్ఱె, కఱ, పెఱ యనునవి తద్భవములు గావని వజ్ఝలవారు కొన్ని హేతువులు చూపిరి (వైయాకరణ పారిజాతము). అట్టి

కారణములు చూపకుండ "విజ్ఞాలెఱిఁగినదే" యని రాధాకృష్ణ మూర్తిగారు కప్పదాటులు వేయనేల?

పాతకోటవారు శబ్దరత్నాకరమును ప్రమాణీకరించి "పొఱుఁడు" దేశ్యమనిరి. మఱి "ద్విరేఫవర్ణ దర్పణము"న (3 ఆ. 108).

> "కాతె జాఱుట చాఱలు చూఱలాడె
> తీఱు పొఱుఁడు ఁేడు సొన్నాఱి, దీర్ఘ
> పరములై బండిఱాలు తద్భవములందుఁ
> గానఁబడుఁ బ్రాతరుత్ఫుల్ల కమలనేత్ర!

అని యున్నదే! ఇపుడు పాతకోటవా రేమందురు? "పొఱ" శబ్దము ప్రాచీన శాసనములో (క్రీ. శ. 641) నున్నది. దాని యిప్పటి రూపము పొఱుఁడు. చిన్నయసూరి సూత్రాంధ్ర వ్యాకరణమునఁ గారక పరిచ్ఛే దాంతమున "వర్ణాభిధానాని" యనుచోట "పొఱు–పొఱుండు" అవి యిచ్చెను. పొఱుటక్క, పొఱుటయ్య, పొఱుటసుర, పొఱువాఁడు మున్నగు వానిని కవులు వాడిరి. శ్రీకృష్ణదేవరాయలే "పొఱుటక్కలు" "పొఱుటసుర" "పొఱువారల సుద్ది"యని ప్రయోగించెను.

"సూరిపై నభిమానమున బహుజనపల్లివారిని కించపఱ చుట సమంజసముగాదు." "విమర్శకులు రెండువైపుల సావకాశముగా ప్రవర్తింపవలెనే కాని యొకరిపై పక్షపాతము వహించుట భావ్యము గాదు."

అని వ్రాసిరి. ఈ వాక్యముల కర్థమేమి? నేను సూరికోపు వేసికొంటినని కాదా? నన్నుఁ గూర్చి వారికా యభిప్రాయము లేని యపుడు వారు బాలవ్యాకరణ సూత్రముల జోలికిఁ బోనేల? "అనేక కర్తృకక్రియ" కను లక్షణము చేసినవా రాచార్యులవారు. ఆ లక్షణ మున "అగు నని యున్నంత సూత్రమున నిత్యవిధి యని భావింపరా" దన్నవారు రాధాకృష్ణమూర్తిగారు. తమ మాటకుఁ బ్రమాణములు త్రిలింగలక్షణ శేషమునుండియే చూపి "యాచార్యులవారి సూత్ర రచనా విధాన మిట్లుండు"నని వారు సిద్ధాంతము చేయవచ్చునే! చిన్నయసూరియూసెత్తనేల? బాలవ్యాకరణమున "అగు"నని యున్న నిత్యవిధిగాదని మాటవరుస కొప్పుకొందము. అంతమాత్రమున నాచా ర్యులవారి త్రిలింగలక్షణశేషమునందు నదియే యర్థమని చెప్పుట తగునా? అంతరంగ సాక్ష్యము బలీయముగదా! తగుదునని సూరి సూత్రముల ప్రసంగము తెచ్చి యసంగతము లగు మాట లాడనేల? పాతకోటవారి వాదము ప్రకారము తుదకేమి తేలును? బాలవ్యాకరణ మున "అగు"నని యున్న సూత్రకార్యము నిత్యమని దువ్వూరివారు వక్కాణించిరిగదా. దానినిబట్టి త్రిలింగలక్షణ శేషమునందు సైత మదియే యర్థమని మూర్తిగా రంగీకరింపవలసివచ్చును. వారంగీకరిం తురా? ఆచార్యులవారి సూత్రార్థమును సమర్థించుటకు మూర్తిగారి చర్చనుబట్టి సూరిసూత్రములు ప్రమాణములుగదా!

అప్పుడు త్రిలింగలక్షణశేషమున "అగు"నననిత్యవిధి యనుట కవియే ప్రమాణము లగును. రాధాకృష్ణమూర్తిగారి వాద పద్ధతి ముల్లుదీసి కొఱ్ఱు కొట్టినట్లుండును. వారు నేను సూరిపయిఁ బక్షపాతము చూపితినని యూనాఁ డనుకొనుట పరమ సత్యము ఈ నాఁడు కాదనుట పచ్చికల్ల.

మూర్తిగా రాడిన యసత్యము మఱొకటి యున్నది. నవంబరు "భారతి"లో వారు "జవ్వనంబున యను నకార విషయము. ఈ విషయమున వారెందులకో శాంతగంభీరులైనారని తోఁచుచున్న"దని వ్రాసిరి. అక్కడికి వా రొక గంభీరశాస్త్ర ప్రసంగము చేసినట్లు! నేను దానిని బూర్వపక్షము చేయలేక తప్పుకొన్నట్లు! పాతకోటవారు బూటకపుమాటలాడుచున్నారు. జూన్ "భారతిలో" లో వారు వ్రాసిన ప్రతి విషయమునకు నేను సెప్టెంబరు "భారతి"లో సమాధానము వ్రాసితిని. మూర్తిగారు జూన్ "భారతి" లో "... ... జవ్వనం బున యందు నని బహుజనపల్లివా రదంతము లగు నమహత్తుల కందు వర్ణకము పరంబగునపుడు నగాగమము కొన్నియెడల కానంబడియెడి" నని చెప్పిరి. సూరి "సమాసంబున యందు" అని ప్రయోగించియే యున్నాడనియు, నట్టి ప్రయోగములు సూరికి తెలియుననియు ప్రసాదరావుగారు వ్రాసినారు. అస్తు. మరి సూరియేల యా విషయ మును సూత్రింపలేదని వ్రాసిరి. దానికి నేను సెప్టెంబరు "భారతి" లో "......బాలవ్యాకరణమున లేకపోవుటకుఁ దద్రచనా ప్రణాళికయే హేతువు. సూరికిఁ దెలియునని నిరూపించుట నాలక్ష్యము. దానికి బాలవ్యాకరణ సూత్రరచనా విధానము నుదాహరణముగాఁ జూపితి" నని

---

## గ మ ని క



మార్చి 1976 భారతిలో శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారి 'బాలవ్యాకరణము–త్రిలింగలక్షణ శేషము' వ్యాసం చివర 'సశేషం' అన్నమాట పడలేదు.

ఇదే సంచికలో **'Book Printing in India'** అన్న శీర్షికలో పడిన వ్యాసం ఆ పేరుకల పుస్తకం సమీక్ష. సమీక్ష చేసినవారు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు.

పొరపాటులు జరిగినందుకు చింతిస్తున్నాము.

సంపాదకుడు

సమాధానము చెప్పితిని. నేను మిన్నకున్న దెక్కడ ? నా వాక్యములు మూర్తిగారే యుదాహరించిరే !

సూరి బాలవ్యాకరణమున లక్షణము దిక్ప్రదర్శనముగఁ దెలిపెద ననెను. ఆయన సేకరించిన లక్ష్యము లెన్నియో యున్నవి. అవి యన్నియు బాలవ్యాకరణమున కెక్కలేదు. బాలవ్యాకరణ స్వరూపమును గూర్చి సూరియు దువ్వూరివారును జెప్పిన మాటలనుగూడ నుదాహరించితిని. నే నాచార్యులవారి "కించపఱచు" చున్నాఁడ నను నింద వేయుటకు ననుకూలములుగావు కావున వారామాటలు ప్రక్కకునెట్టు చున్నారు. సూరి చెప్పని లక్షణము లాచార్యులవారు చెప్పిరి. ఈ మాత్రము త్రిలింగలక్షణశేషతత్త్వము నేను గ్రహించితినో గ్రహింపలేదో నావ్యాసములు చదివిన "భారతి" పాఠకులు సహృదయులు సాక్షులు — రాధాకృష్ణమూర్తిగారు గారు.

బాలవ్యాకరణమున కెక్కని, త్రిలింగలక్షణశేషమున కెక్కిన లక్షణములకు లక్ష్యములుగాఁ దగిన ప్రయోగములు సూరి స్వకీయ రచనములలోఁ జేసెనే ! అవి యెన్నియో కన్నులకుఁగట్టుచున్నవే! మూర్తిగారి కీగుట్టు తెలియునా ? సూరి తాను గావించిన ప్రయోగములకు లక్షణము బాలవ్యాకరణమునఁ జెప్పలేదుగదా ! విమర్శకు లేమనుకొనవలయును ? ఆచార్యులవారు చెప్పిన లక్షణము సూరికిఁ దెలియునని యనుకొనవలయునా ? తెలియవని యనుకొనవలయునా ? తెలియునని యన్నచో సూరిమీఁదిపక్షపాతమగునా ? ఆచార్యులవారి నవమానించుట యగునా ? అగునని మూర్తిగా రనుచున్నారు. "తెలిసియుఁ దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే ?" యని యనుకొనుట తప్ప నేను జేయఁగల దేమున్నది? ఏలయన నాచార్యులవారిమీఁద నాకెట్టి యూరసము లేదని నేనెప్పుడో వ్రాసితిని.

"పేట విషయమున నా వాక్యమును నాగళ్లవారర్థముచేసికొన్నట్లులేదు. నాగళ్లవారి కర్థము తెలియుట సాధ్యమా ? కాన వారు విపరీతముగా వ్యాఖ్యానించినా" రని పాతకోటవారు పలికిరి. విషయములు వివరింపక చప్పునఁ దప్పుకొనిపోవుట పాతకోటవారి కలవాటు. వారు చెప్పిన మాటల యర్థము నాకుఁ దెలియని యపుడు, వారి మాటలకు నేను విపరీత వ్యాఖ్యానము చేసినపు డర్థము తెలియునట్లు చెప్పి, సద్వ్యాఖ్యానము చేయుట వారి ధర్మము. మహా పండితు లయిన రాధాకృష్ణమూర్తిగారు నవంబరు "భారతి"లో నా ధర్మమును గాలికి వదలిరి. అది వారి వాద దౌర్బల్యమున కుపలక్షణము. "నా యభిప్రాయ మిది" యని స్పష్టముగా వక్కాణింపవచ్చును గదా ! బూకరింపులు చర్చలకు సాధనములుగావు, కారాదు. నాగళ్లవాఁడను గాన చెప్పుచున్నాఁడను—పాతకోటవారితో వాదము చేయుట చెత్త నూర్చుడి.

"లజ్జావారిధి దిగ" అని నేను చూపిన పాఠము వావిళ్లవారిని [వావిళ్లపాఠము నని నేను వ్రాసితిని] వలచి వ్రాసినవ్రాఁతలట! అవి యప్రమాణమట. వీరు చూపిన "తగ" ప్రయోగములు వావిళ్లవారి పుస్తకములలోనివిగాదా ?" యని మూర్తిగారు వ్రాసిరి. ఇట "కావా ?" యని యుండఁదగును. తమమాట యితరుల కర్థముగాలే దనువా రన్యులమాటలను సక్రమముగా సమీక్షింపవలయును. వావిళ్లవారు ప్రకటించిన కావ్యములోనిది కావున "దిగ" యను పాఠ ముచితము గాదని నే ననలేదే! ప్రకరణోచితముగాదుగాన యసమంజసమంటిని. ఎట్లసమంజసమయినదో వివరించితిని. "సందర్భము లెస్సగా విచారించినఁ బయిపద్యమున "దిగ" నని యుండరాదు. ఉన్నచో ద్రౌపది లజ్జావారిధిలో దిగిన దను దురర్థము దోఁచును. ఆమె లజ్జావారిధి యందుఁ దనంత తాను దిగలేదు"—ఇవి నేను సెప్టెంబరు "భారతి" లో వ్రాసిన వాక్యములు. నేను వావిళ్లవారి భారతమునుండియే "తగ" ననుదానికిఁ ప్రయోగములు చూపితినని పాతకోటవారు భావించుట కాధారమేమి ? తిక్కనప్రయోగము మంచి సెబ్బఱల నెంచుటకు నే నెన్ని భారత ప్రతులను సంప్రతించితినో వ్రాసితినే ! పాతకోటవారావాక్యములు చూచియుండరు. నాకడ వివిధ సంస్థలు, భిన్నవ్యక్తులు ప్రకటించిన యాంధ్రమహాభారత ప్రతులుగలవు—ఇట్లనుట యాత్మప్రశంసయని తలంపఁగాదు. రాధాకృష్ణమూర్తిగారుగాని, వారి సహాయులుగాని, యనుయాయులుగాని వచ్చి వానిని జూడవచ్చును.

రాధాకృష్ణమూర్తిగారు "దిగు" ధాతువునకు "పడు" అను నర్థము చెప్పుకొనవలయునని జూన్ "భారతి"లో వ్రాసిరి. "లజ్జానవరాశిలో మునిగి"యని ద్రౌపది శ్రీకృష్ణునితో ననినమాట నిజమే. అయిన నేమి ? అంత మాత్రమున "దిగు" ధాతువు "పడు" అను నర్థ మీఁగల్గునా? ఈ యర్థమును సమర్థించుకొనుటకుఁ బాతకోటవారు ప్రాచీనకవిప్రయోగములేల యియ్యరు ? అర్థనిర్ణయమెట్లు చాగునో విజ్ఞులకుఁ దెలియని యగాధ విషయము గాదు. నిఘంటువులు భిన్నార్థముల నిర్ణయించునపుడు కవిప్రయోగము లౌనఁగును. లోక వ్యవహారమును గుర్తించును. మూర్తిగా రావనిచేయక స్వైరవిహారము చేయుచు నర్థ నిర్ణయము గావించుటకు గాలిని మూటగట్టుచున్నారు.

తత్త్వదర్శిత లేని రాధాకృష్ణమూర్తిగారు నే నాచార్యులవారిని "కించపఱచు" చున్నాఁడనని చర్చను ప్రక్కదారులు పట్టించిరి. నిరాధార ప్రసంగములు చేయుట నేర్చిరి. సూటిగా వారినొకే యొక ప్రశ్న మడుగుచున్నాఁడను. ఆచార్యులవారు చెప్పిన లక్షణములు సూరికిఁ దెలియునని సిద్ధాంతము చేసితిని. సాక్ష్యములు చూపితిని. అవి సబల ప్రమాణము లవునా ? కావా ? ఈ ప్రశ్నమునకు సోపపత్తికముగా నవుననియో కావనియో సూటిగా సమాధానము చెప్పఁగలిగినఁగాని వారు నాతో వాదముచేయుట కర్హులుగారు.

—: స మా ప్త ము :—

# కార్తికస్నానం

శ్రీ వేలమూరి ప్రసాదరావు

కార్తికిక మాసావృత్త వృత్తాంధకారంలో
    గ్రాంధికంలా గజగజా వొణికిస్తున్న చలిలో
కళ్ళుమూసుకుని, పళ్ళు గిట్టకరుచుకుని
చాదెడు నీళ్ళు నెత్తిన ద్రిమ్మరించుకుని
'కవితాకూపంలో గ్రుంకా' ననుకుంటూన్న కవిలాగా
పురాణ స్నానం చేస్తున్న పుణ్య స్త్రీవి నువ్వు.

స్నానం మాలిన్యాన్ని క్షాళితం చెయ్యాలి.
కానీ, ఒళ్ళు రుద్దుకోవు నువ్వు.
ఏడుకొండలవాడి అర్చకులు సైతం
నుదుటన అర్ధచంద్ర హస్తప్రయోగంచేసి
పంగనామాలు చెరగని పట్టు నేర్చుకొని
చేస్తున్నారు వాస్తవ నాస్తిక స్నానాలు.

తెల్లవారుజామున వెలిగించిన వొత్తి వెలుగులో
తెల్లవారితే యెవర్ని సాధించాలా అని ఆలోచిస్తూ
దీపంవేడిలో చలికాచుకోవాలని
దీవ్యద్ద్వ్యానర్ఘ ప్రయత్నం చేస్తున్నావు.
కాలం కాల్చి బూడిదగా మార్చిన కవితాధోరణిలో
నిప్పుకణకల్ని వెదికి చలి కాచుకుందా మనుకుంటున్నావు.

కాలాన్ని చూడనని కళ్ళుమూసుకున్నవాడికి
ఆలస్యంగానైనా అచ్చమైన భావాలు రావు
కళ్ళుమూసుకుని స్నానంచేస్తూన్న నీకు
బావిప్రక్క, చెట్టుక్రింద, బాధలతో మూల్గుతూన్న
కుంటివాళ్ళు, బిచ్చగాళ్ళు, గుడ్డివాళ్ళు, మడి వాళ్ళు
కన్పిస్తున్నారా? మూలుగులు విన్పిస్తున్నాయా?

రాత్రంతా నిద్రించి పురాణ పుణ్య లాభానికి
స్తోత్రంచేస్తూ? చాదలతో స్నానం చేస్తున్నావు.
రాత్రంతా నిద్రలేక, రాలుతున్న హిమకణాల్లో
గాత్రం కంపిస్తుంటే, అతగాడూ స్నానంచేశాడు.
వెచ్చటి గదిలో చల్లటివేళ వెలిగిస్తే నీవు దీపం
వెచ్చటి గుండెలో చల్లటిమంచులో వెలిగింది వాడి బుభుక్షా
శాపం.

వాడి కర్మకు 'నేనేం చెయ్య' నని వాపోతావు;
కనుకొలుకుల్లో బాష్పాలను అవసరమైతే కురికిస్తావు.
వాడి 'కర్మ: నువ్వుకాదూ? ఉంటూన్నయిల్లూ,
తింటూన్న తిండీ, కడుతూన్నబట్టా వాడి 'కర్మ' కాదూ?
నిజం నీకు తెలుసు. నీళ్ళు పల్లానికి పోవటంలేదు.
అందుకే చాదల్తో అవసరానికి కాస్త బాధను కొనుక్కుంటు
న్నావు.

మంచివాణ్ణి చంపిన మాక్బెత్ చేతుల రక్తాన్ని
కడగటానికి సప్తసముద్రాలూ చాలలేదు.
కన్నబిడ్డల్ని చంపగల్గిన కఠినత్వం ఉందనుకొన్న
లేడీ మాక్బెత్ చేతుల్ని యింకా కడుక్కుంటూనే వున్నది.
కార్తిక స్నానాల్లో కాలుష్యం కరిగిపోదు.
వార్తిక విజ్ఞానంలో నర్తించదు కవితాసతి.

---

# జాతీయ వేతనా విధానము

## శ్రీ యిమ్మానేని సత్యసుందరం

ఇటీవల కాలంలో జాతీయ వేతనా విధానాన్ని రూపొందించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. మన ఆర్థిక వ్యవస్థలో విపరీతంగా పెరిగే ఆదాయ సంపద వ్యత్యాసాలను తగ్గించి, వివిధ రంగాలలో పనిచేయువారికి న్యాయమైన వేతనాలు సమకూర్చుటయే ఈ జాతీయ వేతనావిధానముయొక్క ముఖ్యోద్దేశము. మన ప్రణాళిక సంఘము నియమించిన కమిటీ జాతీయ వేతనా విధానముపై నివేదిక సమర్పించి సంవత్సరం దాటినప్పటికి, ప్రభుత్వము ఈ విషయంలో ఇంకా ఎటువంటి చర్యలు తీసికొనలేదు.

ఉత్పత్తిని పెంచుటయేగాక, అభివృద్ధి ఫలితాలు అన్నివర్గాల వారికి లభించేటట్లు చూచుట ప్రభుత్వ బాధ్యత. సాంఘిక న్యాయము చేకూర్చవలసిన అవసరం మన దేశంలో ఎంతైనా వున్నది. కారణం: ప్రజలలో ఎక్కువమంది దారిద్ర్యాన్ని అనుభవించుట సుమారు జనాభాలో 40 శాతం మంది దారిద్ర్యరేఖకు (Poverty line) దిగువనే ఉన్నట్లు తెలియుచున్నది. అంటే, 1960–61 ధరలలో వారి సగటు నెల ఆదాయము 20 రూపాయలలోపు. గ్రామీణ ప్రాంతాలలో దిగువనున్న 20శాతం ప్రజలు మొత్తం ఆదాయంలో 9 శాతం అనుభవించగా, పైనవున్న 5 శాతం ప్రజలు 17 శాతం ఆదాయాన్ని అనుభవించుచున్నారు. పై 50 శాతం మంది ఆదాయంలో 69 శాతం అనుభవించగా, దిగువ 50 శాతం మంది 31 శాతం ఆదాయాన్ని అనుభవిస్తున్నట్లు అంచనా వేయబడినది. గ్రామీణ దారిద్ర్యము విపరీతంగా పెరుగుచున్నది. ఉదాహరణకు' 1950–51, 1960–61 మధ్యకాలంలో గ్రామీణ ప్రజల తలసరి ఆదాయం 14 శాతం పెరగగా, పట్టణ ప్రజల తలసరి ఆదాయం 68 శాతం పెరిగెను. దీనినిబట్టి పెరుగుతూవున్న జనాభాని పోషించే శక్తి వ్యవసాయరంగానికి లేదని తెలియుచున్నది.

పట్టణ ప్రాంతాలలో పై 10 శాతం కుటుంబాలు ఆదాయంలో 42.4 శాతం అనుభవించుచున్నారు. (ఈ శాతం గ్రామీణ ప్రాంతాలలో 34) పట్టణ ప్రాంతాలలో దిగువనున్న 10 శాతం మంది ఆదాయంలో 1.3 శాతం అనుభవించుచున్నారు. (గ్రామీణ ప్రాంతాలలో ఈ శాతం 1 కంటె తక్కువ) పై 50 శాతం మంది మొత్తం ఆదాయంలో82.5 శాతం అనుభవించగా, దిగువ50 శాతం మంది మిగిలిన 17.5 శాతం ఆదాయాన్ని అనుభవిస్తున్నట్లు **N. C. A. E. R. (National Council of Applied Economic Research)** అంచనాల వలన తెలిసినది. గ్రామీణ ప్రాంతాలలో 57శాతం కుటుంబాలు నెలకు 100 రూపాలయలలోపు ఆదాయంతో జీవించుచున్నారు. పట్టణప్రాంతాలలో ఈశాతం 39వున్నది. గ్రామీణ ప్రాంతాలలో దిగువనున్న 5 శాతం మంది, పట్టణ ప్రాంతాలలో దిగువనున్న 40 శాతం మంది విషయంలో వినియోగస్థాయి పెరగక పోగా తగ్గినది. దేశంలో దారిద్ర్యం ఈ విధంగా వున్నపుడు జాతీయ వేతనా విధానానికి ప్రత్యేకమైన ప్రాముఖ్యత వున్నది.

జాతీయ వేతనా విధానం కొన్ని ఆర్థిక లక్ష్యాలను సాధించుటకు ఉపయోగపడును. ద్రవ్యసరఫరా ద్రవ్యఆదాయాలు విపరీతంగా పెరుగుటవలన ఇటీవలకాలంలో ధరలు విపరీతంగా పెరిగినవి. దేశంలో వున్నమొత్తంఉత్పత్తికి, మొత్తంద్రవ్యపరిణామానికి సమానత్వంఏర్పరచుట జాతీయ వేతనా విధానముయొక్క ఉద్దేశము. అటువంటప్పుడే ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధితోబాటు; సుస్థిరత ఉండును. పెరుగుతూవున్న ఆదాయం కొంతమంది చేతులలోనే కేంద్రీకృత మవరాదు. ఈ ఆదాయంలో ఎక్కువ భాగం బలహీనవర్గాలకు చేకూర్చవలసిన ఆవశ్యకత వున్నది. ఉదాహరణకు, మన శ్రామికులలో ఎక్కువమంది వ్యవసాయకార్మికులు. వీరికి బేరమాడేశక్తి తక్కువ. వీరికి కార్మిక సంఘాలు అంటూలేవు. అందువలన వీరి వేతనాలు చాలాకాలంగా తక్కువస్థాయిలో వున్నవి. ప్రభుత్వంవారి విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసికొనవలసి వున్నది. ఆదాయ వ్యత్యాసాలు తగ్గకపోగా పెరుగుచున్నవి. శ్రామిక జీవులలో చాల ఎక్కువ శాతము కనీస వినియోగస్థాయిని కూడ చేరుకోలేని స్థితిలో వున్నారు.

బలహీన వర్గాలకి న్యాయమైన వేతనం చేకూర్చుట అవసరం. ఇలా జరగనినాడు, శ్రామికులలో అశాంతి బయలుదేరి, పారి

---

రచయిత మచిలీపట్నం హిందుకాలేజిలో పోస్టుగ్రాడ్యుయేటు ఆర్థికశాస్త్ర శాఖలో లెక్చరర్.

శ్రామిక సంబంధాలను కుంటుపరచును. అభివృద్ధి చెందిన దేశాలలో వేతనా విధానాన్ని ధరలను అదుపులో వుంచుటకు ఉపయోగించు చున్నారు. అయితే, అభివృద్ధి చెందుతూవున్న దేశాలలో ఆదాయ వ్యత్యాసాలు ఎక్కువగా ఉండుటచే వేతనా విధానంద్వారా వాటిని తగ్గించుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి. వేతనా విధానంయొక్క లక్ష్యాలలో అభివృద్ధి చెందిన దేశాలకు, అభివృద్ధి చెందుచున్న దేశాలకు ఈ విధంగా తేడా వున్నది. అయితే వర్తమాన దేశాలలో కూడా వేతనా విధానము ఆదాయ వ్యత్యాసాలను తగ్గించుటకే కాకుండా ధరలను అదుపులో వుంచుటకు కూడ ఉపయోగపడును.

జాతీయ వేతనా విధానాన్ని రూపొందించునపుడు మనదేశ ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితులను దృష్టిలో వుంచుకొనక తప్పదు. ఉదాహరణకు, మనదేశంలో కొన్ని రంగాలు బాగా అభివృద్ధి చెందినవి. మరికొన్ని రంగాలు బాగా వెనుకబడినవి. ఇటువంటి పరిస్థితులలో జాతీయ వేతనా విధానాన్ని రూపొందించుట కష్టమగును. వ్యవసాయరంగంలో ఆర్థిక, సాంఘిక పరిస్థితులు వ్యవసాయ ప్రజలు ఆదాయాలను పెంచుకొనుటకు వీలుగా లేవు ఈ రంగంలో నిరుద్యోగము, ప్రచ్ఛన్న నిరుద్యోగము హెచ్చుస్థాయిలోవున్నవి. తమ న్యాయమైన వేతనాలకు పోరాడేశక్తి తెలివితేటలు వ్యవసాయ కార్మికులకు లేవు. పారిశ్రామిక రంగంలో శ్రామికులు మాత్రం కార్మిక సంఘాలుగా ఏర్పడి న్యాయమైన వేతనాలను పొందుచున్నారు. చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికి అనేక విధాల ప్రభుత్వం ప్రోత్సాహం కల్పించినా, అవి తగినంతగా అభివృద్ధి చెందలేదు. వాటిలో పనిచేసే శ్రామికుల పరిస్థితి, వ్యవసాయ కార్మికుల పరిస్థితి ఒకే విధంగా వున్నది. అంతే కాదు, భారతదేశంలో ప్రాంతీయ అసమానతలు ఎక్కువగావున్నవి. అభివృద్ధిచెందిన ప్రాంతాలలో వేతనాలు వెనుకబడిన ప్రాంతాలలో వేతనాలకంటె చాల ఎక్కువ

జాతీయ వేతనా విధానము పరిశ్రమ పరిశ్రమకు మధ్య, ప్రాంతము ప్రాంతమునకు మధ్య అనవసరపు వేతనా వ్యత్యాసములను తొలగించుటయేగాక, వేతనా ఆదాయాలకు, ఇతర ఆదాయాలకు మధ్య వ్యత్యాసములనుకూడ తొలగించ వలెను. ధరల పెరుగుదలను అరికట్టి అతి తక్కువ ఆదాయములను పెంచుటకు వేతనా విధానము తోడ్పడ వలెను. అయితే, వేతనా విధానము ఉద్యోగావకాశములను పెంచవలెనే గాని, తగ్గించరాదు. అంటే ఒక పరిశ్రమ అభివృద్ధికి వేతనా విధానము అడ్డుగా వుండరాదు.

వివిధవర్గాల శ్రామికులకు కనీస వేతనాలు నిర్ణయింపబడినవి. అయితే, కనీస వేతనాలు నిర్ణయించుటకు ఏయే అంశములను లెక్కలోనికి తీసికొనవలెనో మనము ఖచ్చితంగా నిర్ణయించలేదు. అయితే కనీస వేతనాలను నిర్ణయించుటలో గుర్తించుకొనవలసిన కొన్ని అంశాలు ఇవి: శ్రామికుని, అతని కుటుంబ అవసరాలు, సంస్థకు వేతనాలు చెల్లించగలశక్తి, ఇతర శ్రామికులు పొందుచున్న వేతనాల స్థాయి. అయితే దీనిలో ఏ ఒక్కదానిని ఆధారం చేసికొని జాతీయ వేతనా విధానాన్ని రూపొందించలేము. ఉదాహరణకు కార్మికుని అతని కుటుంబ అవసరాలు అంటే ఏమిటి? అవి మారుతూ వుంటాయి. శ్రామికులకు కనీస వేతనాలు ఇవ్వడం అవసరం. అయితే ఒక సంస్థ కనీస వేతనాలు ఇవ్వలేకపోయినందున, దానిని మూసివేసినచో కార్మికులకు నష్టం కలుగుతున్నది. అదేవిధంగా సంస్థ వేతనాలు చెల్లించగల శక్తి (Capacity to pay)ని బట్టి వేతనాలు నిర్ణయిస్తే, సంస్థకు సంస్థకు మధ్య వేతనాల వ్యత్యాసము విపరీతంగా వుండవచ్చు.

వేతనాలు చెల్లించగల శక్తిని బట్టి వేతనాలు ఇవ్వమని శ్రామికులు అనవచ్చు. అయితే ఈ సూత్రానికి కట్టుబడితే అనేక సమస్యలు ఎదురగును. ఈ సూత్రం సంస్థకు సంస్థకు మధ్య వేతనాల వ్యత్యాసమునకు దారితీయుటయేగాక, కొంతమందికి అన్యాయము జరుగును. ఉదాహరణకు, భారీ పరిశ్రమలలో పనిచేయువారికి ఆ పరిశ్రమలకు ఆర్థిక వ్యవస్థలో వున్న ప్రాముఖ్యతనుబట్టి హెచ్చు వేతనాలు ఇచ్చుచున్నారు. అయితే యిలాచేయుట ఎంతవరకు న్యాయము ? ఈ పరిశ్రమల స్థాపనకు దేశప్రజలందరు తోడ్పడ్డారు. ఎక్కువ పన్నుల రూపంలోగాని, పొదుపురూపంలోగాని– అటువంటప్పుడు ఈ పరిశ్రమల లాభాలను ఆ పరిశ్రమలో పనిచేసేవారికే సమకూర్చుట న్యాయమని తోచదు. విదేశీ ఋణాలతో ఈ పరిశ్రమలను స్థాపించినా, ఆ ఋణభారం ప్రజలందరిమీద పడునుగదా ? అంతేకాదు. పరిశ్రమ ప్రాధాన్యతను బట్టి వేతనాలు హెచ్చు స్థాయిలో నిర్ణయిస్తే మిగతా పరిశ్రమలలో పనిచేయువారు తమకు అవే వేతనాలు కావాలని ఆందోళన చేయుదురు. ఒక సంస్థ అధిక లాభాలు పొందుచున్న మాత్రాన దానిలో పనిచేయువారందరికి అధిక వేతనాలు ఇచ్చుట కేవలం అన్యాయమే కాకుండ అది ప్రమాదకరమైన పరిస్థితులకు దారి తీయును. అలా అని, సంస్థ ఆర్జించే లాభాలకు ఆ సంస్థ యిచ్చే వేతనాలకు ఎటువంటి సంబంధం వుండకూడదని కాదు. కేవలం లాభాలపైన ఆధారపడే వేతనాలు నిర్ణయించరాదు.

శ్రామికుల వేతనాలు వారి ఉత్పాదకతపై ఆధారపడవలెనని కొందరి అభిప్రాయం. కొందరికి ఇది నచ్చదు. కార్మిక సంఘ నాయకులు కార్మికుల ఉత్పాదకతతోసంబంధంలేకుండా వారికి కనీస వేతనాలు చెల్లించవలెనని వాదించెదరు. ఉత్పత్తిని గరిష్ఠం చేయుటకు వేతనా

లను ఉత్పాదకతతో కలుపవలెనని ఇటీవల కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం వెలిబుచ్చారు. వేతనాల పెరుగుదల ఉత్పాదకత పెరుగుదలతో ముడిపడి వుండవలెనని ప్రభుత్వ అభిప్రాయము. అయితే ఈ పద్ధతిలోకూడ అనేక చిక్కుసమస్యలు వున్నవి. ఉత్పాదకత పెరిగినా, పెరగకపోయినా వస్తువుల ధరలన్ని పెరుగుచున్నపుడు కార్మికులు హెచ్చువేతనాలు కోరుట సమంజసమే. ధరలు విపరీతంగా పెరుగుటవలన కార్మికుల వాస్తవిక ఆదాయంలో (వస్తురూపంలో ఆదాయంలో) మార్పు వుండుటలేదు. కేవలం ద్రవ్య వేతనమాత్రం పెరుగుటవలన ప్రయోజనం లేదు. వాస్తవిక వేతనం పెరగకపోగా తగ్గుచున్నట్లు ఈ దిగువ పట్టిక తెలుపుచున్నది.

పరిశ్రమలలో పనిచేయు కార్మికుల ద్రవ్య / వాస్తవిక ఆదాయాల సూచీ సంఖ్య (**Index Number**) (**Base 1961-100**)

| సంవత్సరము | జాతీయ విని యోగదారుని ధర సూచీసంఖ్య | ద్రవ్య ఆదాయ సూచీ సంఖ్య | వాస్తవిక ఆదాయ సూచీసంఖ్య |
|---|---|---|---|
| 1962 | 103 | 106 | 103 |
| 1963 | 106 | 109 | 103 |
| 1964 | 121 | 114 | 94 |
| 1965 | 132 | 128 | 97 |
| 1966 | 146 | 139 | 95 |
| 1967 | 166 | 151 | 91 |
| 1968 | 171 | 160 | 94 |
| 1969 | 169 | 166 | 98 |

శ్రామికుని వేతనమునకు అతడు చేసే పనికి సంబంధము వుండవలెనని అందరు అంగీకరించినదే! అయితే, శ్రామికుని పని ప్రాముఖ్యత నిర్ణయించుటెలా? అతని ఉత్పాదకతను నిర్ణయించుటెలా? శ్రామిక ఉత్పాదకత అనేక అంశములపై వుండును. పెద్ద పరిశ్రమలలో శ్రామిక నైపుణ్యం ప్రాముఖ్యంగాని అతడు ఎన్ని గంటలు పనిచేస్తున్నదికాదు. శ్రామిక ఉత్పాదకతను నిర్ణయించుటలో ఈ విధంగా అనేక సమస్యలు వున్నవి. జాతీయ శ్రామిక కమీషన్ కూడ పనినిబట్టి వేతనాన్ని నిర్ణయించడం కష్టమని. ఆ పద్ధతి కొన్ని పరిశ్రమలకే పరిమితమై ఉండునని అభిప్రాయం వెలిబుచ్చినది. వేతనా పద్ధతికి సంబంధించిన కొన్ని సమస్యలను చక్రవర్తి కమిటి పరిశీలించెను. వేతనాలు జీతాలు పొందేవారి సంఖ్య ఇతరుల సంఖ్య కంటె తక్కువగావున్నా. వారికి ఆర్థిక వ్యవస్థలో అత్యధిక ప్రాధాన్యత వున్నది. 1971 మార్చిలో మన దేశంలో శ్రామికశక్తి 180 మిలియన్లు. వీరిలో 72 మిలియన్లు (40 శాతము) వేతనము, జీతాలు పొందేవారే. సుమారు 47.5 మిలియన్లు వ్యవసాయ కార్మికులు. 17.5 మిలియన్ల శ్రామికులు పరిశ్రమలలో పనిచేయుచున్నారు. (రిజిష్టరు చేసుకున్న పరిశ్రమలు). 7 మిలియన్ల శ్రామికులు వ్యవసాయేతర సంస్థల (రిజిష్టర్ చేసికొననివి)లో పనిచేయుచున్నారు. 17.5 మిలియన్ల శ్రామికులలో ప్రభుత్వరంగంలో 10.7 మిలియన్లు, ప్రైవేటు రంగంలో 6.8 మిలియన్లు పనిచేయుచున్నారు. వేతనాల నిర్ణయంలో ప్రభుత్వజోక్యం వుండాలని దానిని మార్కెటు శక్తులకు వదిలివేయరాదని చక్రవర్తి కమిటి అభిప్రాయపడెను.

ఉద్యోగాలమధ్య, పరిశ్రమలమధ్య ప్రాంతాలమధ్య వుండే వేతనా వ్యత్యాసాలు నేర్పరితనంలోను, పనిచేయు పరిస్థితులలోను వుండే వ్యత్యాసాలకు అనుగుణంగా వుండవలెను. అయితే, మనదేశంలో ఎక్కువగా అవి యజమాని-శ్రామికుల బలాబలాలపై ఆధారపడినవి. ఈ కారణంగా, కొన్ని సంస్థలలో (రిజిష్టరు చేసికొనని) వేతనాలు అతి తక్కువ స్థాయిలో వున్నవి. కష్టపడి పనిచేసేవారికి కనీస వేతనము కల్పించుటలో ప్రభుత్వజోక్యం తప్పదని చక్రవర్తి కమిటి తెలిపెను. శ్రామికుని మొత్తం వేతనంలో ఈ అంశములు వుండవలెనని కమిటి అభిప్రాయము. 1. కనీస వేతనము. 2. నేర్పరితనంకు గుర్తింపు. 3. అపాయకరమైన పనులకు నష్టపరిహారము. 4. అభివృద్ధి వాటా (**Grouth Dividend**). 5. కరువుభత్యము మరియు 6. లాభాలలో వాటా.

వేతనాల నిర్ణయం విషయంలో మనకు నిర్ణీతమైన అంశాలు అంటూ ఏమి లేవు. కరువుభత్యము విషయంలో కూడ ఇదే పరిస్థితి వున్నది. కరువుభత్యము వేరు వేరు సంస్థలలో వేరువేరుగా వున్నది. సామాన్యంగా కరువుభత్యమును బేసిక్ జీతంలో కొంత శాతంగా నిర్ణయిస్తారు. చాల సంస్థలలో కరువు భత్యము బేసిక్ జీతము కంటే తక్కువగా వుండును. కాని బ్యాంకులు, జీవిత భీమా సంస్థ మొదలగువాటిలో కరువుభత్యము ఈ జీతము కంటె 1.5 లేక 2 రెట్లు ఎక్కువగా వున్నది. హెచ్చు స్థాయిలో వున్న కొన్ని జీతాలు వుండవలసిన స్థాయిలోకంటె హెచ్చుస్థాయిలో వున్నవని ప్రణాళిక సంఘ సభ్యుని ఆధ్వర్యంలో ఏర్పడిన కమిటి అభిప్రాయపడెను. ప్రభుత్వ రంగంలో వున్న జీతాలకు, ప్రయివేటు రంగంలో వున్న జీతాలకు కూడ దగ్గర సంబంధం వుండవలెను.

జాతీయ వేతనా విధానమును రూపొందించుటలో ఇంకొక ఇబ్బంది కూడ వున్నది. కొన్ని జీతాల విషయంలో ఇతర రకాలు పొరి

తోషికం మనం చూస్తున్నాము. ఉదాహరణకు ఉచితఇల్లు, ఉచితంగా తిరుగుటకు వాహనము (ఆఫీసుపనిపైనే అనుకోండి), ఉచిత భోజనము, అధిక కాలం పనిచేసి అధిక వేతనం (Over time) లాభాలలో వాటా—బోనసు మొదలగునవి. ఇంకొక విషయం ఏమిటంటే, ఇవి పరిశ్రమకు, పరిశ్రమకు మారుచున్నవి. వాటిని Basic జీతంలో శాతంగా నిర్ణయించినపుడు Basic జీతం పెరిగినపుడు ఇవికూడ పెరుగుచున్నవి. అటువంటప్పుడు జాతీయ వేతనా విధానాన్ని రూపొందించుట కష్టము. కొందరి విషయంలో ఈ పారితోషికాలన్ని జీతంలో 40 శాతం వరకు వుంటున్నవి.

దేశంలో పెరుగుతున్న ఆదాయ వ్యత్యాసాలనుగూర్చి చక్రవర్తి కమిటి ఆందోళన వ్యక్తపరిచినది. ఆదాయాల పెరుగుదలను అరికట్టుట ద్వారా ఈ వ్యత్యాసాలను కొంతవరకు తగ్గించవచ్చునని ఈ కమిటి అభిప్రాయపడెను. ఆదాయ వ్యత్యాసాలు ముఖ్యంగా నేర్పరితనం వ్యత్యాసాలకు అనుగుణంగా వుండేందుకు ఈ పద్ధతి తోడ్పడును. అభివృద్ధిలో శ్రామికులకు వాటా వుండుట జాతీయ వేతనా విధానంలో ఒక ముఖ్య అంశము. అంతేకాకుండా సంస్థ లాభాలలో కూడ శ్రామికులకు వాటా వుండవలెనని కమిటీ అభిప్రాయపడెను. ఒక జాతీయ వేతనా కమీషన్‌ను ప్రభుత్వం స్థాపించవలెనని చక్రవర్తి కమిటి సూచించెను.

బ్యాంకులు, కంపెనీలలో పనిచేసే కొంతమంది నెలకు 4000 రూపాయల జీతం పొందుచున్నారు. ఇది రిజర్వుబ్యాంకు గవర్నరు జీతంకంటె ఎక్కువ. గుప్తధనం పెరుగుదల ఆదాయ వ్యత్యాసాలను ఇంకా పెంచినది. కొన్ని రంగాలలో ముఖ్యంగా వ్యవసాయ రంగంలో శ్రామికుల జీతాలు అతి తక్కువ స్థాయిలో వున్నవి. పారిశ్రామిక రంగంలో ద్రవ్య వేతనాలు పెరిగినా, వాస్తవిక వేతనాలు పెరగలేదని, పైగా వేతనాల పెరుగుదల ఉత్పాదకత పెరుగుదలకంటె తక్కువగా వున్నదని జాతీయ పారిశ్రామిక కమీషన్ అభిప్రాయపడెను.

అయితే అన్నిటికంటె ముఖ్యమైనది ఒకటి వున్నది — ధరల స్థిరీకరణ. ధరలు పెరుగుతూవున్న పరిస్థితులలో ఒక నిర్దిష్టమైన వేతనా విధానాన్ని రూపొందించుట సాధ్యపడదు. ధరల పెరుగుదల వలన వేతనాలు పెరిగి, మరల ధరల పెరుగుదలకు దారి తీయుటచే ఆర్థిక వ్యవస్థ ఒక విష వలయంలో చిక్కుకొనును. శ్రామికులకు న్యాయమైన ధరలకు అత్యవసర వస్తువులను సరఫరా చేయవలసిన ఆవశ్యకత వున్నది. వేతనా విధానము ఆదాయ విధానము రెండు ఒకదానికొకటి సహాయపడును. అత్యధిక ఆదాయాలపై గరిష్ట పరిమితిని నిర్ణయించవలసిన అవసరం వున్నది.

వేతనాన్ని నిర్ణయించుటలో జ్ఞాపక ముంచుకొనవలసిన ముఖ్య విషయాలు:— 1. శ్రామిక ఉత్పాదకత 2. అదే పరిశ్రమలో గాని, ఇతర ప్రాంతాలలో గాని అదే పనికి చెల్లించే వేతనాలస్థాయి. 3. జాతీయ ఆదాయస్థాయి, పంపకము. 4. ఆర్థికవ్యవస్థలో పరిశ్రమకుగల స్థానం. అయితే, వీటిలో ఏఒక్క అంశమును ఆధారము చేసికొని వేతనాలను నిర్ణయించరాదు. వీటి కన్నిటికి తగు ప్రాముఖ్యత యివ్వవలెను.

ఇంకొక విషయం. ప్రతి సంస్థ తన శ్రామికులకు ఒక నిర్ణీతమైన కనీస వేతనం చెల్లించాలి. కనీస వేతనంకూడ చెల్లించలేని సంస్థకు పనిచేసే అర్హత వుండదు. ఆ సంస్థ అత్యవసరమైనచో ప్రభుత్వము సబ్సిడీ ఇవ్వవచ్చును. అంతేగాని, శ్రామికులకు అన్యాయం చేయుట ద్వారా ఏ సంస్థ పనిచేయకూడదని ప్రస్తుతం అందరి అభిప్రాయము.

అయితే, శ్రామికులకు న్యాయమైన వేతనాలు సమకూర్చే ఆవశ్యకత వున్నప్పటికి, వేతనాలు విపరీతంగా పెరిగినచో శ్రామికులకే హాని జరుగును. వేతనాలు పెరుగుదల వలన యజమానులు శ్రామికులకు బదులు యంత్రాలను ఉపయోగించినచో నిరుద్యోగం పెరుగును. వాస్తవిక వేతనాలు, శ్రామిక ఉత్పాదకత ఒకే దిక్కులో పయనించవలెను.

# రెండు కవితలు

## "నిఖిల్"

### "31 డిసెంబరు 1975"

కనుచూపుమేర పాకిపోయిన
మంచు పొరలో
ఆడే నీడల ఆకారాల సందుల్లో
జల్లెడపడుతున్న సూర్యకిరణాలు
365 రోజుల మైదానాల గుండా
పాతుకున్న జీతాల మైలురాళ్ళ దగ్గర
180 రోజుల సమాధి బ్రతుకుల్లోన
బిక్కుబిక్కుమని అరిచే క్షణాలు,
చావు ఈ రోజు
చాస్‌నాలా బొగ్గుగనిలోకి చొచ్చి
వికటాట్టహాసం చేస్తున్నది
జలసమాధిలో
372 బొగ్గు జీవితాలను మాడ్చి-పూడ్చి.
చావు ఎక్కడో ఎదురుపడి
పలకరించక మానదు,
అయినా
మరణాన్ని గుర్తించని బతుకు మనది
భయాల కొండలమీద
జీవితారోహణ —,
నిర్భయపు పలుగు—పారలు-చేతుల్లోన.
చచ్చినా అందరి బతుకుకోస మనే భావన
మంచును కరిగించే బల మైన నడక
పాతపదాల సమాధులపైన
ఊగుతూ పిలుస్తున్నాయి
కొత్తపదాల ఎర్రగన్నేరులు.

### "1 జనవరి 1976"

తలవొంచుకుని పోతున్న
వీధిలోని పెద్దన్నా!
ఇంకా తలవంచుకుని కూచున్న
ఇంటిలోని చిన్నన్నా!
ఏనాడో తలవొంచుకుని—
వెళ్ళి పోయింది 1975.
నీటిధార
వంచుకున్న తలపై నుంచి
నెమ్మదిగా తలను
ఇంకా వొంచుతూనే జారుతుంది
మట్టిలోకి తొక్కేస్తుంది.
తల ఎత్తుకుని
నడిచేవాడికి తలను ఢీకొన్నా.
నీరు జారక తప్పదు భుజాలపైనుంచి.
వెళ్లిపోయిన సంవత్సరం
నిన్న తలవొంచుకున్నా
తిరిగి నేడు 1976 గా తల ఎత్తుకొని
వీధిలోని పెద్దన్నను
ఇంటిలోని చిన్నన్నను తలఎత్తి
పైకి చూడమంటుంది.
తల వొంచుకుని పోయేవాడికి
ఏనాటికీ
ఎలాంటి బాధ లుండవనేది—
నిన్నటి సత్యం
ఈ రోజు—రేపు ఏ మాత్రం కాదు.
గెలుపొందేవాడి పక్కే
కలకాలం తాళం వేసేవాడు
వోడినవాడి పుంజుకుంటున్న బలాన్ని చూడడు.
వోడిన నిజం ఏనాటికైనా
అసత్యం—పాశవికత్వపు తలలను వొంచుతూ
తలఎత్తుకునే వుంటుంది కొత్తసంవత్సరంలా!

చిన్న కథ

# మానస సరోవరం

## (చైతన్య స్రవంతిలో రచన)

శ్రీ పి. యస్. శాస్త్రి

"మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయా !" అవునవు నవును. మనస్సే అన్నింటికీ మూలం. మనస్సు లేకపోతే మనమూ లేం! అంటే మనస్సు జడమైనప్పుడు మనిషికి ఐహిక బంధాలు నశిస్తాయి! అంతే...అంతే...అంతేనా! "నీ మనసు నా మనసు ఏకమై..." అయి, అయి, అవడం అసలు సంభవిస్తుందా? అంటే ఇక్కడ మనస్సంటే ఆలోచన. లోచనాలకందనిది ఆలోచన... సులోచన ఎక్కడవుందెక్కడవుంది?...అక్కడే అక్కడే ఇంద్రజిత్తు దగ్గర...అంటే ఇంద్రుణ్ణి జయించినవాడనేనా?...–జిత్తు నుంచి పుట్టిన తెనుగుపదం చిత్తు...అంతే! బ్యూటీ! మనం తెనుగు పదాలవ్యుత్పత్తి అండ్ వికాసంకని పెట్టగలమన్నమాట...గలం,గలం..., గురు లఘువుల కలయిక గలం! వల, నగ, సల, భ, ర, త, ఇలో ఈ గలం లేదు...అన్నట్టు గురువు, లఘువులను కలిపి ఏకసమాసం చేయడం సోషలిజంలక్ష్యంకదూ?...అందుకే..."అందుకే యూహాయి" అందుకే ఆంధ్ర సాహిత్యంలోకూడా గురు, లఘువులు ఎగిరిపోయి వచన కవిత్వం రాజ్యం చేస్తోంది...సో...ప్రభుత్వంవారి ఆదేశిక (ఆదేశికా, నిర్దేశికా?) సూత్రాల ప్రకారమే ఆంధ్రసాహిత్యమూ నడుస్తోంది...

భేష్! భేష్! యీ విషయాన్ని వచ్చే సాహితీ సదస్సులో చెప్పి బూజుపట్టిన, బుర్రలు పండిన, పండితులకు వచనకవితా వికాసాన్ని నిరూపిస్తా...ఆహా సుదినం! ఒహో సుదినం...ఛందో పండితులకు దుర్దినం...అవునవును! అంటే...లేకపోతే ఆ 'సూర్యం' కవి "నీకు పద్యాలు రాయడం రాదు కనుక వచనం రాసి దాన్ని కవిత్వం అంటున్నావు" అంటాడా?...చట్టాలలో బిగించకుండా ఆధునిక నైరూప్య చిత్రకళలాగే సాహిత్యమూ నైరూప్యంగా వర్ధిల్లడానికి "అనిబద్ధ" లేక 'స్వేచ్ఛా', లేక 'పద్యగంధి' కవిత్వాన్ని రాస్తాం!...అది తప్పయితే దానికి 'కుందుర్తి'ని తిట్టాలి లేదా 'బాలగంగాధర తిలక్'నీ, వేగుంట మోహన్ ప్రసాద్ని లేదా తిరగబడు, విరగబడు, అరస, విరస, సరస కవుల్ని తిట్టాలి కాని నన్ను సభామధ్యంలో ఎంత అహంకారం ఆ పద్య కవికి?...

"వస్తున్నానయ్యా బాబూ! వస్తున్నా! తలుపు తీసేవరకూ ఆగలేవూ?...వూ?...ఎందుకని? మీ ఆవిడ "నేను వచ్చేవరకూ వచ్చినట్టు కదలకుండా కూర్చోండి" అంటే నోరు మూసుకు కూర్చుంటావేం?...ఉండు...ఉండు వస్తున్నా..."

"హహహ! నిజమండీ! మీరు తలుపుకొట్టటం వినిపించలేదు... అబ్బే మీరు వస్తారనుకుంటే నా యింటి తలుపులు బార్లా తీసిపెట్టి కూర్చోనూ?...ఎంతమాట! మీరు నన్ను కలుసుకోవడానికి రావడం మహదానందకరమైన విషయం..."("...వెధవ వెధవ వెంట వెధవ! ప్రొద్దున్నే అయిదురూపాయలు అప్పు కావాలిట. నాకూ కావాలి యిచ్చే వెధవుంటే! ... చక్కటి ఆలోచనలు ఆగిపోయేలా చేశాడు...")

"అయ్! హహహ! ఏమీ ఆలోచించటంలేదండీ! 'ఊరక రారు మహాత్ములు...' అన్న పద్యం గుర్తుకు వచ్చి... భలేగా చెప్పారు; 'అప్పంటే తప్పు'! నిజమే! నిజమే... నేను వైద్యుణ్ణి మీరు రోగిసూ...(రోగం! వెధవ పాతకలా వున్నాడు, అప్పులుచేసుకు తిని!) నిజమే... 'అప్పిచ్చువాడు వైద్యుడు' అన్నాడు కదా సుమతీశతక కారుడు..."

"అబ్బే కాఫీ, సిగరెట్టు అన్నీ మానేశానండి ఖర్చులు పెరిగిపోయి... అందుకే మీకేదీ ఆఫర్ చెయ్యలేకపోతున్నా ... వెళ్తామంటారా... శుభం... వెళ్ళిరండి!"

"ఉల్ఫాగా అయిదు రూపాయలు కొట్టేశాడు... ఇచ్చేదీ లేదు వచ్చేదీ లేదు!..."

"హహహహ...ఈ నవ్వెక్కడిది? మదీయ మానసాంతరాళము నుండియే ఈ నవ్వు వెలువడుచున్నది... చాలు చాలు ..."ఓ అజ్ఞాత శక్తీ! బయటకు వచ్చి నీ నిజస్వరూపమును చూపుము..."

"ఓరీ రామారావూ! నీ పిచ్చికవిత్వాలన్నింటినీ శ్రద్ధగా విన్నట్టు నటించినందుకు, శంకర్రావుకు డబ్బియ్యక తప్పుతుందా?... 'ధనమూల మిదం జగత్' అన్న సూక్తి మరచిపోయావా?... నీ కవిత్వానికి, కడుపులో త్రిప్పినా, ఆ భావాన్ని పైకి కనబడకుండా పుండ

టానికి ఎంత తిప్పలు పడివుంటాడో గ్రహించలేవు నువ్వు! ... హహహ! బాగా అయింది. ఇంకెప్పుడూ ఎవరికీ బలవంతంగా కవిత్వం వినిపించకు! ... !"

"హోరి మనస్సులోని మనిషి! సూక్ష్మ శరీరంలోంచి నువ్వు చేసే సహాయం ఇదా!... కారణ శరీరానికి తోడునీడగా, అండగావుండి నన్ను మంచి మార్గంలో నడిపించి మోక్ష సామ్రాజ్యాధిపతిని చెయ్య వలసింది పోయి, నన్నే అవహేళన చేస్తావా? "కవయః నిరంకుశా" అన్న సూక్తి వినలేదా?...నేను నిరంకుశుణ్ణి! నా యిష్టం వచ్చి నట్టు చేస్తా! చార్వాక మతంలో కలిసి నీ అస్తిత్వాన్నే కాదంటా! ఈ శరీరం, దానిలోని కోరికలు, యివే నిత్యమైనవి, సత్యమైనవి. ఆత్మలు, పరమాత్మలు, మోక్షం, పాపం, పుణ్యం, నువ్వూ, నీ సూక్ష్మ శరీరం, అన్నీ వొట్టి హంబగ్! ... పో! పోయి నిన్ను సృష్టించిన విధాత అంటూవుంటే వాడికి చెప్పుకో!..."

"దెబ్బకి నోరు మూసాడు!" నువ్వే లేవు! ఒకవేళ వున్నా "నీ అస్తిత్వాన్ని నేను గుర్తించను!" అంటే ఏంచేస్తాడు తోక ముడవటం తప్ప! ఏం? పీపిల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా అనేది లేనే లెదు...ఫార్మోజాయే చైనా అని అమెరికా యిరవై యేళ్ళపైన బుకాయించలేదూ?...అంతే అంతే...

"......రా శారదామణీ ..." "నీవు లేక వీణ నిదురపోవు చున్నదీ..."

..."అమ్మోయ్... నిజంగానే బెడ్‌రూమ్‌లోంచి ముందుగది లోకి వస్తోంది..."...

"ఏంలేదు శారదా... ఊర్కినే పిలిచా... అదా ఏదో పాట నోటి కొస్తే..." "తప్పే తప్పే!... నోటికి వచ్చిన పాట పాడటం తప్పే, కాని... చూశావూ... శారదకూ వీణకూ అవినాభావ సంబంధం వుంది... అందుకని... రైట్... ఎగ్రీడ్!... సరేకాని శారదా మనం యీ ఆదివారం అలా సరదాగా తిరిగి రావాలి... మొదట మేట్నీకి, తరువాత పార్కుకి... పిల్లల్ని ప్రక్కింటి అత్తయ్యగారింట్లో వది లేద్దాం ప్లీజ్ శారదా! కాదనకు... తొందరగా తయారవు..."

..."శారదా నను చేరగ......" ...రారాదా మది నిన్నే పిలిచే గాదా..."గాథా సప్తశతి" 'ఆంధ్ర శాతవాహన చక్రవర్తి హాలుని...' హాలికులైననేమి విజదారసుతోదర పోషణార్థమై ... ... హు! ఇప్పుడు అందరికంటే హాలికుల పనే బావుంది! అన్ని అప్పులూ, సబ్సిడీలు, గ్రాంటులూ వాళ్ళకే! చివరకి యిన్‌కమ్ టాక్సు కూడా లేదు... పోతన్నగారు యిప్పుడుంటే ఎంత సంతో షించేవాడో!..."

"మా తెలుగు తల్లికీ మల్లెపూదండా..." కాదు... "అహో ఆంధ్రభోజా శ్రీకృష్ణదేవరాయా!"...ఇదీకాదు "కనుపించదే నేడు కాకతీయుల మహా"...నవలక్ష ధనుర్ధరాధిపతులట "ఓడల జండాలు ఎగురునందాకా"...రాయప్రోలు..."తెలుగదేల యన్న దేశంబు తెలుగు" ...శ్రీకృష్ణదేవరాయలవారు, కన్నడ రాయడు, కన్న కలలు యిన్నా ళ్ళకు ఆకృతి దాలుస్తున్నాయి... తెలుగువాళ్ళు కెప్పుడూ తెలుగు ఎంత గొప్ప భాషో, తెలుగుదేశం యెంత గొప్పదో, ఎవళ్ళేనా పైదేశస్థులు చెప్పాలి. అప్పుడు వేడి పుడుతుంది. తాటాకు మంటలా మండి చల్లారుతుంది. తెలుగువాళ్ళ యీ తెగులుకు మందిచ్చే నాథుడే లేడే...

"ఒస్తున్నానండీ బాబూ, ఎవరో ఆగండి..." "హో మీరా... మీరాదేవిగారూ... రండి కూర్చోండి. మణీ రామారావ్ లోపల వున్నారు...'నారీ లోకా'నికేమండీ?... మీలాంటి నారీమణులంతా దాన్ని కొంటున్నంత కాలం చక్కగా నడుస్తుంది. ఇంతకీ మీరేపని మీద...అదా...అనుకున్నాలెండి. (కాగితాల దొంతర తెచ్చిందిరా బాబూ యీవిడ!... సీరియల్‌లా వుంది. చదవటం మొదలుపెడితే ఆపదు ...ఏం చెయ్య నేం చెయ్యను...)

"ఓహో! "సీతాపతిగారి సంసారం"లాంటి ధారావాహిక నవలా! శహభాష్! బలేగా రాశారండీ!... ముగింపు అక్కర్లేదు... పాత కథతో సంబంధం అక్కర్లేదు. కరెంట్ టాపిక్స్‌తో, పాత పేర్లతో, వ్రాసేస్తూపోవడం... మీ యిష్టం! ఎన్నాళ్ళేనా నడు స్తుంది!... ఉండం డుండండి... శారదను పిలుస్తాను... ఆమెకు తెలుసుకాని యీ కథల, నవలల బాగోగులు నాకేం తెలుసండీ... వస్తాను కూర్చోండి...

"...అమ్మయ్య! ఏకష్టంతోనహా, చదివి వినిపించే మీరాదేవిని తప్పించుకోగలిగా... పాపం శారద ఏం తంటాలు పడుతోందో యేమో!... ఒక్కసారే మాదిరెడ్డి, యద్దనపూడి, సులోచనలంత గొప్ప రైటర్‌ని అయిపోవాలని ఆవిడనవల వెండితెర కెక్కాలని, కోరిక పాపం ఆ మీరాదేవికి."

..."అరే! అరే! ఆవిడని అవతానే వొదిలి వచ్చేశావా శారదా?... లేదూ!... మరి...మరి..., అయ్యో నీ అసాధ్యంకూలా! దాన్ని చదివి నీ అభిప్రాయం చెబుతాననీ,... చంద్రకళామందిర్‌లో క్రొత్త సినిమా గురించిన పరిచయ సభ వుందనీ చెప్పావా... అహో!

'బుది కి బృహస్పతివి'కదా... అది సరే, మరి యింతకీ... "అబ్బబ్బ ఈ కథలలో నాలుగు మంచి కథలుచూసి చెప్పమంటే నా తరమా?... ఏది పచురించబడిందో, ఏది ప్రచురించబడలేదో, నా కసలు గుర్తుండదు కదా! పోనీ అని, యీ రచయితలు పాత కథలు పంపక మానరుకదా! ఎందులో పొరపాటున వో చ్చయిన కథనే మళ్ళీ అచ్చువేయిసే ఇంటెలిజెంట్ పాఠకులు ఊరుకోవటంలేదుకదా!... కనుక వో నారీలోకపు సంపాదకమణి, నా శారదా గమణి... నువ్వే ఆ కథలసంగతి చూసుకో...ఇంకా కావాలంటే వో గంట వంటపని చూసా! నాకేం నామోషీ లేదు...వెనుకటికి లింకన్ అన్నట్లు. మన వంట చూస్తానుకాని వేరేవాళ్ళకి వంట చేసిపెట టం లేదుకదా?... ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలోనైనా మనిద్దరం సంసారపు బరువు బాధ్యతల్ని సమానంగా వహిద్దాం..."

"ఛ! ఎంతమాటంది! మీరు వంటసంగతి చూస్తే యింక తిన్నట్టే అనా? హవురా కలికాలం! వంటలో పురుషుల ఆధిక్యత తెలియక అన్నమాట అది...నల, భీమ పాకం అన్నారేకాని ఆడవాళ్ళ పేరెత్తలేదే! వడ్డన గాజుల హస్తాలతో అయితే బావుంటుంది. కాశీ అన్నపూర్ణ, వడ్డనకే ఫేమస్, కాని వంటకు కాదుకదా!

..."హలో రామనాధం... ఏమిటి యిలా వచ్చేశావు. అరే! అరే! శ్రీమతి కమలారామనాధంకూడా వచ్చేరే!... "ఏమిటి... ఈ పూట మా యింటో కులాసాగా భోజనంచేసి, సరదాగా మాట్నీకి వెళ్ళి...సాయంత్రం యింటికి వెళ్ళాలనా"... "మైగాడ్! మైగాడ్! నా ప్రోగ్రాం గోవిందా గోవింద!..." అబ్బే ఏంలేదు... గోవిందం వూళ్ళో వున్నాడో లేడో అని అనుకుంటున్నా... అంతే ఊహూ!... మీరు రావడం మాకేం యిబ్బందిగా లేదు!... అబ్బే నువ్వు నిన్న చెప్పకపోయినా ఫరవాలేదు. ఉయ్ ఆర్ వెరీ ప్లీజ్డ్! నిజం... శారదా...శారదా...నీ ఫ్రెండ్ కమలగారూ, నా ఫ్రెండు రామనాధం వొచ్చారు."

# తెలుఁగు పలుకు

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

౧

పంచదారకంటె పటికిబెల్లముకంటె
పండియుండు చూతఫలచయంబు
రసముకంటె చెఱకురసముకంటెను చాల
తీపి గలది కలికి తెలుఁగుపలుకు

౨

వెన్నముద్దకంటె జున్నుకంటె మనోజ్ఞ
మౌ శిరీష మావికాళికంటె
దూదికంటె హంసతూలికకంటెను
లలిత మెన్నఁ గలికి తెలుఁగుపలుకు.

౩

సన్నజాజికంటె సంపంగికంటెను
కుందసుమముకంటె కోమలమగు
మాలతి మరువంబు మందారమునకంటె
అలఘు సురభిళంబు తెలుఁగుపలుకు.

కప్పురంబుకంటెఁ గస్తూరికంటెను
అగరుపొగలకంటె అత్తరువుల
కంటెను ఘుమఘుమలు కలకాలమును గ్రక్కు
పొలుపుగలది కలికి తెలుఁగుపలుకు

౫

కలముకంటె వాఁడిఖడ్గంబుకంటెను
శూలచయముకంటె శూరవర్యు
నస్త్రవితతికంటె నణ్వాస్త్రములకంటె
దివ్యబలముకలది తెలుఁగుపలుకు.

౬

అందమై నితాంత మానందకందమై
ముత్తియముల భంగి ముద్దుగులుకు
రత్నచయముపగిది రమ్యాతిరమ్యమై
వెలయుచుండుఁ గలికి తెలుఁగుపలుకు.

# రాయనామచరిత్రావళి

## డా. నేలటూరు వెంకటరమణ

శ్రీ గోపాలా రాధాలోలా శితజన పరిపాలా
ఆగమలీల సుధారసపాలా అగణిత గుణజాలా
పంకజనాభ సుధానిధే నీకిదె యంకితమిచ్చెదను
రాయనామచరిత్రావళి యనియెడురమ్యమైన యొక కథనూ ।

10 నేలటూరు శ్రీ వెంకటరమణుని
పాదభక్తు నీ సేవకునీ
13 అంగీకరించి కరుణించవయ్య నన్నాదరించి కృపతోడుతనూ

### దేవతాస్తోత్రము

వినాయకునికి మ్రొక్కెదనూ
విఘ్నరాజునకు మొక్కెదనూ
నారాయణునికిని నలినాక్షునకూ
పార్వతీశునికి పరమేశ్వరునకును
బ్రహ్మకు మానసపుత్రులైనయా నవ
బ్రహ్మలకు నందరకూ
లచ్చుమదేవికి సరసోతమ్మకు
కొండలరాయనికూతురికీ
అందఱకును జేమోడ్చెదనిప్పుడు
'23 ఆదరించుడని కోరుచునూ
వాల్మీకయ్యను వ్యాసమహర్షిని
కాళిదాసుని కవితల్లజునీ
బాపుక ధావుక భాసులనూ
భవభూతయ్యను పాండ్యసుందరుని
నాగార్జునులను నారాయణునీ
బట్టబాణునీ ప్రభాకరులనూ
20 తక్కుంగల గీర్వాణులనెల్లను
తప్పక నిట బజియింతున్॥

పంపని పొన్నని రన్నని జన్నని
బహుళంబగు కర్ణాటక కవులను
నాద్యుల పూజ్యుల నందరినీ

25 చింతింతు గణింతు నుతింతున్ ।
నా కార్యము నెఱవేరుటకై

ఆంధ్రభారతిని నవనికిదెచ్చిన
నాద్యుల పూజ్యుల నందఱనూ
బినవల్లభు శ్రీవత్సగోత్రుని
30 విక్రమార్జున విజయ శ్రీకృతి
పంపని తమ్ముని బ్రాహ్మణునీ
పులకేశి శ్రీపుణ్య వల్లభుని
సత్యాశ్రయనామాపురధారుని
పండరంగు పరమేశభక్తునీ

35 గుణగాంక శ్రీ విజయాదిత్యుని
అరికేసరినీ యాజిపార్థునీ
రణమర్దనునీ రాజసింహునీ
కవిరాజు శ్రీ నన్నెచోడునీ
రాజరాజు శ్రీ రాజనరేంద్రునీ

40 నారాయణునీ నన్నయభట్టును
తిక్కయజ్వను తిక్కరాజును
మనుమసిద్ధినీ మల్లగణకునీ
పావులూరు పురపాలకునీ
శంభుదాసుని శంకరభక్తునీ

45 మోమునందు ముక్కంటిని దాచిన
నాచిరాజు శ్రీ సోమనాథునీ
పాలకురికిని బసవుని భక్తుని
అల్లమ ప్రభుని యక్కాదేవిని
ప్రతాపరుద్ర ప్రతాపభూపుని

50 మల్లికార్జుని మంత్రిభాస్కరుని
హుళక్కి భాస్కరు నయ్యపరాజును
అమరేశ్వరు నీ యంబసత్వకృతి
పోతరాజునూ పురుషోత్తమునీ

శ్రీనాధుని మా సిరిగిరిరాజును
యథావాక్కులన్నయ్యగారలను

కవితకు బుట్టినింటిగృహపతుల
వెన్నెలకంటి విశిష్ట కవులను
తాళ్ళపాక వంశాంబుధిసోముల

అన్నమయ్యనూ చిన్నమయ్యనూ
పెద్దన్నను దిమ్మన్నను బిన్నన
మాదయగారి మల్లననూ
శ్రీ ధూర్జటి కవినీ, ధూర్జటి భక్తుని

60 శౌర్యవదాన్య పరాక్రమములందును
విక్రమార్క శ్రీ విక్రమభోజుల
నధఃకరించిన యాంధ్రభోజుని
హిందూధర్మ సముద్ధర ధీరుని
హిందూ రాజ్య రమా శ్రీనాధుని

65 సమరాంగణ శ్రీ చక్రవర్తిని
కవితా పావీణ్య ఫణీశుని
నాట్య కళాదుర్గార్గ వరేశుని
కువలయ పురుషుని కృపాంభోనిధిని
యవనాంతకునీ యశోభూషణుని

70 నాగాంబా నరసేంద్రుల నందను
కృష్ణాంశజునీ కృష్ణరాయలను
కీర్తింతు నుతింతు గణింతున్
రామభద్రునీ రామకృష్ణునీ
రామభూషణుని రంగపరాజును

75 అన్నయ్యను సూరయ్యను పింగళి
రథకార రుద్రుని రాధామాధవు
నవరకులుని శ్రీ చిన్ననారణుని
రఘునాయకునీ రాజపూజితుని
చామకూర నసలేని పసగల
వేంకటపతినీ విజయరాఘవుని

80 మంగాజి మన్నారుదాసులను
రంగాజీని రామాభద్రను
కృష్ణాజీని కృష్ణాధ్వరినీ
సహాజీని నాసరఫోజీనీ
తక్కినటి తంజాపురి కవులను

85 చిరన్నాపల్లి శ్రీ రంగాంధ్రుల
చొక్కనాధుని చిక్కవిభునీ
మహారాణీ మంగమ్మగారలను
రామప్పయ్య రణరంగధీరుని
సమ్ముఖమ్ము శ్రీ వెంకటపతిని

90 తక్కినట్టి మన దక్షిణాంధ్రులను
మఱి యిప్పటి మన యాంధ్రకవులలో
నాటక రచనా చక్రవర్తినీ
వేదవంశ విద్యా శ్రీమూర్తిని
ప్రతాపరుద్ర ప్రతాప యశముల

95 భూషించిన యా పురుష సరస్వతి
ధర్మవరము శ్రీ కృష్ణాచార్యుల
నూతార్జ్యాన నాటకములచే
నాంధ్రభారతిని యలంకరించెడు
కవికోకిలలను కవిరాజులను

100 కవిసామ్రాట్టుల సార్వభౌములను
విశ్వనాధ శ్రీ సత్యనారనను
దేవులపల్లిని దేవరపల్లిని
కృష్ణశాస్త్రి నీ కృష్ణారెడ్డినీ
రేప్రహోషనా యనెడు జేసుభక్తునీ

105 గబ్బిలంబులను కాందిశీకులను
పర్వాశీకవి పావన చరితను
రచించినట్టి యా రమ్యకవీశ్వరు
విజయాశ్వ శ్రీ విజయకృతిని
పింగళి సూర్యపరావతారునీ

110 శ్రీవత్స శ్రీ గోత్ర సంభవుని
నేలటూరు శ్రీవరదుని భక్తుని
కేశవార్య నామాంకధారునీ
యక్షగాన శ్రీ చక్రవర్తినీ
పిచ్చయ నామకవీశ్వరునీ

115 చింతింతు నుతింతు గణింతున్

యున్నారయ్యా యీ కతనూ
కన్నారయ్యా మా యెతనూ
మధ్యయుగపు మా భారత చరితలో
వచ్చిరి తురకలు వచ్చిరయా

120 ఎచ్చటనుండియో యేనాధులవలె
యనాధ ప్రేతంబులవలెను
వందలు వేలూ లక్షలు కోట్లూ
అర్బుదంబులున్యర్బుదంబులూ
ఆద్యంతంబులు యెఱుగని మూకలు

125 గుంపులు మందలు కోలాహలులూ
నాళ్ళుకూలెను వీళ్ళు పగలెను
ఊళ్ళు రగలెను పురములు పొగసెను
అగ్నిపాలై బుగ్గి బూరలై

130 గార్ధభంబులకు తీర్ధములై
బాపనాట మఱి సాగలేదయా

132 బ్రహ్మ సృజించిన భూప్రపంచమున
నమసిరి రాజులు పొలసిరి భోజులు
సెట్లు కలసిరి మట్లోపలనూ
సూద్రులెల్లను భూద్దరిత్రిలో
పూడిపోయిరయా పొడవడకా
పొలములు దున్నే భూమికాపులు
పత్తాలేక పాఱిపోయిరి
పొలములు యెండెను

140 పైరులు మండెను
దారిదోపిడులు తఱచైపోయెను
బందిపోటులు బలసిపోయెను
అడవులపాలై రదవదనందుచు

144 జనులును మునులును మనుగడలెఱుగక

## AD. 1295

కాలయముఁడు తాఁ గటిక తురకయై
యల్లావుద్దీనైనాడూ
దేవగిరికి వచ్చాడూ
రామదేవుని కొట్టాడూ

150 భార్యాకూతుల బట్టాడూ
కమ్మాదీని కన్నాడూ
దేవల్దేని దిలకించాడూ
నారి కరగ్రహ మర్పించాడూ
దేవగిరిని కొన్నాడూ

155 దయ్యపు గొండగ జేశాడూ
అయ్యల్లొయ్యల్దిన్పించాడూ
వేలాది బాపనోళ్ళకీ
జన్నారులెత్తగ దెంపాడూ
సానపూబెండ్లి చేశాడూ

160 బాపల్ సయ్యదులైనారూ
రాజులు షేకులైనారూ
అయ్యల్మియ్యాలైనారూ
సెట్లు సెయిటులైనారూ
అధమవర్ణులు హలాల్ ముల్కాలై

165 దక్కి తురకలైనారూ
గుళ్ళను విరుగా గొట్టారు

167 మస్జీదులుగనూ మార్చారూ

## A. D. 1303

అల్లావుద్దీన్ సుల్తాన్ గా లోక
నందును దక్షిణ మంపారూ

170 తీరాంధ్రమును తెలంగాణమునూ
తెక్కలిగోలుట కంపారూ
గుఱ్ఱపు తురుపులు తుమ్మెలు కమ్మెలు
లెక్కలెని కోటానుకోటులు
దుమ్ముమేఘములు దుందుమారములు
యాడకాడ పొడకట్టినవి
కాలయముణ్ణో కాల్చుకమెసవిన
మల్లిక్ ఫక్రుద్దీన్ జూనా
వారికి నాయకుడైనాడూ
వచ్చిరయా వారందరు వ్యాళమై

180 నబ్బినాటికిని చక్కగనూ

ఓరుగంటిలో నున్నాడయ్యా
కాకతీయుల కడపటిరాజు
ప్రతాపరుద్ర ప్రతాపభానుడు
తొమ్మిది లక్షల తురుపుదారులకు
వీరులు శూరులు విక్రమార్కులకు
దొ॰ వారలకు దునేదారులకు
అధినాయకుఁడయ యుందఱకూ

* * *

తురకల్ దేశము జొచ్చిరనీ
189 వార్తలు వచ్చీ చేరినవీ

190 రుద్రభూపతీ కోపోజ్వలుఁడై
రుద్ర రూపమూ జూపాడూ
సేనానాథుడు సింగమనేడూ
సీతువరాలసింగమనేడూ
అన్నారెడ్డీ పొన్నారెడ్డీ
వేమారెడ్డీ సోమారెడ్డీ
కాటమరెడ్డీ కోటమరెడ్డీ
పేటలనేలే పెదా రెడ్డీ
కార్యాగాలా కాటారెడ్డీ
నూకారెడ్డీ మేకారెడ్డీ

200 రేయికి రేయే వచ్చారూ
తూరుపునాటీ చోళరాజులూ
రాయలసీమా రాజులునూ
చంద్రవంశ చాళుక్య రాజులూ
సోమవంశపు సోమిదేవుడూ
కొటికంటి శ్రీరాఘవరాజూ
వేంగిదేశపు వెంగమరాజూ
కోనేటిపురపు కొండలరాజూ
ఏరువనేలే వెంగమరాజూ
కామరాజా కామేశ్వరరాజూ

210 భవభక్తుడు శ్రీ భక్తిరాజూ
ముసునూర్నేలే ముదుసర్నా
ప్రోలయ కాపయభూపతినిడ్లు
అందఱు చేరిరి యనుమకొండకూ
ప్రతాపరుద్రుని పజ్జకునూ

215 ఏమి సెలవు మమ్మేలిన సామీ
తురక యేడ దూదేకేడేడా
అని గర్జించిరి యైక్యమునన్
హసించినాడూ ఆ మహరాజూ
ఉప్పరపల్లెకు ఉరకండయ్యా

220 శత్రువులైనా సాయబులెల్లా
ఆడనె యాగేయున్నారూ
మక్కానులలో హుక్కాల్ తాగుచు
వాగుచు వీగుచు నున్నారూ

* *

నాయకులందఱు నవ్వారూ

225 హరహర మహదేవన్నారూ
గజదళాలూ కదలినవీ
తురగ తరంగల్ దూకినవీ
దంచనాలూ తరలినవీ
గడలవారూ కడతలవారూ

230 ఈటెల్వారూ పోటులవారూ
విలుకాండ్రు సింగాణికాండ్రునూ
అన్నివిధాలా ఆయుధకాండును
సంగరభూమికి సాగినరూ
ఆడుచు పాడుచు నవహసించుచూ
గేలి సేయుచును కేరడించుచును
గంతుల్ వేయుచు రంతులు పల్కుచు
పాలికలానికినీ పుణ్యభూమికిని
బయలువెడలిరయ పడలు పడలుగా

* *

అరదముదోలే యరుణదేవుడూ

240 తలచూపాడూ ధళధళమనుచూ
ఏడుగుఱ్ఱము లెగసినవీ
యేడేడు యోజనా లెగసినవీ
పురుహూతుని యిల్లాలి బొట్టనగ
కనుపించెనయా కమలమిత్రుడూ

245 పొడుపుకొండపై ప్రొద్దుపవే
తురకదండు దూదేకే దొరలూ
అల్లాసామిని అరశారూ

అల్లకెనాంకరు అన్నారూ
రసూల్గారిని రహమత్గారిని

250 తలచి తలంచీ తరతరములుగా
మక్కావైపూ చక్కగ దిరిగీ
మోములు భువిపై మోదుచునూ
పైగంబరువారి ప్రథమ శిష్యులము
ఫతహ్మదే కాఫరులారా

255 అని గర్జించుచు యాయుధములోని
కవిసిరి వా ర్కాఫరుల మీదనూ

*                *

ఈటెల నీటెలు మీటినవీ
కత్తుల్ కత్తుల్ గలసినవీ
గదలను గదలూ గదిసినవీ

260 విండ్లు విండ్లు విరుగాడినవీ
గుఱ్ఱాల్లు ఱ్ఱాల్లూడనవీ
గజాలు గజాలా గాడినవీ
ఎక్కటి లెక్కటు లెగసినరూ
సంగడికాండ్రూ సచ్చినరూ

*                *

265 పోరు ఘోరమై పొంగినదీ
వాలు చేత గొనిరు దదేవుడూ
వైరుల మీదికి దుమికినడూ
అంగరేకులూ లెంకజోదులూ
అందఱునూ గుమిగూడినరూ

270 భండారపు శ్రీ హరిహరదేవుడు
ప్రక్కన బలిసి నిలిచాడూ
ఫణిహారి శ్రీ బుక్కరాయడు
బడితకత్తిని బట్టినడూ
ఎదురె తాకిన జూనాఖానుడు
యేటులు వడి యిల కొరిగినడూ
తురకల్ చుట్టూ దుమికినరూ

---

అరివీరులనూ అదిమినరూ
ఆంధ్రుల శేకులు అణగినరూ
దురమున తురకల్ తూలినరూ

280 రక్తము రణమున బారినదీ
హిందూముస్లిమ్ సమ్మేళనమూ
యేకాండమ ప్రవహించినదీ
నేటూరి శ్రీ వెంకట రమణుని
రాయనామ చరితావళిలో

285 ఆదిపర్వమున నాశ్వాసంబూ
ప్రథమం బిది యని యెఱుగండీ
ప్రజలారా యో ప్రజలారా

288 యో జనులారా యో మునులారా

# రాయనామ చరితావళి-ద్వితీయాశ్వాసము

ఒక్కనాటి యా వేకువజామున

290 ఉషఃకాంత తలయెత్తినదీ
తూరుపుదెస నాకాస లచ్చిమీ
తొలిసర్మార్తల చూపినదీ
అరుణదేవుని యరదపుకాంతులు
ఆకసమంతట బర్వినవీ
ఏకశిలానగరంపు వాడలలో
వేదువీధులకూటమిలో
నక్కలవాడ యిక్కలలో
మాచల్దేవీమందిరంబున
పిల్లకూటపు బెద్దసాలలో

300 జారుల సభ సమకూడినదీ.

కాసల్నాటి బాపడు మీసాలప్పయ్యగారి మేనల్లుడు మంచన గోవింద శర్మ యపరాధమును విచారించుటకొఱకు—ఆరేయి ప్రతాపరుద్ర దేవుఁడు మాచల్దేవి కౌగిట నిద్రించిన కారణమువల్ల నా జార సభకు అగ్రాసనాధిపత్యము వహించి యున్నతాసనమున గూర్చుని యున్నాడు- ఉన్నటులుండి, —

ఢాం ఢాంమున ఢాంఢాంమున ఢంకా శబ్దము మ్రోగినదీ
కళ పెళ కళ పెళ కళ పెళ మంటూ కంచునగారా పల్కినదీ
రణమో రణమో, రణమోయంటూ రణతమ్మెట రవళించినదీ
అల్లహోయక్బర్ యల్లహోయక్బరుఅనుచూసాయెబూలరసినరూ

310 ఆదమరచియట గూర్చుని యుండిన రుద్రుడులేచి యురికినడూ

312 మాచల్దేవియు మధుమావతియు మరుగుహలలో దూరినరూ
మల్లికాపూర్మరాటివాడూ—మహామేఘసన్నిభుడూ
కాలాంజనమును కారుమబ్బునూ—మరిపించే మైచాయగలాడూ
మహమన్నబీని తలచాడూ—తురకదండుతో దూకాడూ

320 జాతికోటలోజాతిబండలూ — రారమ్మయంటూరచ్చపెట్టినవి
స్వామి స్వయంభూనాధుని గుడిలో—కేతువు కిలకిల నవ్వినదీ
గంటలు గణగణ మ్రోగినవీ—వేదవిదులును విద్వాంసులునూ
ఆపద దెలియక యరమరలేక-వేదములన్నీ విప్పీ విప్పీ
పన్నాలన్నీ పరిపరివిధముల—బరియించిరయా బ్రాహ్మణులూ

* * *

330 తురక దళాలూ కోట జొచ్చినవి — పేటల్నాటీకొట్టినవీ
కొఱవుల్బట్టుక—ఖోజాలూ—కోటగోడపై గూడినరూ
అరబ్బీలు నూనెగుప్తలునూ—సర్దేరియా సయ్యదులూ
పారశీకులూ బాగ్దాదీలూ—ఆఫ్ఘానులునూ నర్కోసియలూ
శంభునిగుడిసిసాపుగగూల్చిరి—స్వామిస్వయంభూనాధునిగుడిపై
విమానములనూ వేదికలన్నిటి విరగద్రోసిరయవీరతురుష్కులు
వీరరుద్రుని జెఱగొనిబోవగ—రాణివాస శుద్ధాంత కాంతలతొ

343 రాజును రాణులు తోడన్.

* * *

335 ఉన్నటులుండివచ్చిన తురకల—యుద్రేకమును సహింపజాలక
ఒంటరియైన ప్రతాపమహీపతి - యోలమాసగొనియొదగెను
శీఘ్రమె
శ్రీ మాత శ్రీ పాదముచెంతకు—అమ్మగారు శీముమ్మడమ్మతో

340 నధ్యాహారము సల్పంగన్

342 ఏమరుపాటున నెవ్వరులేక — పాడుతురుష్కులుపాలఁబడితిరీ.
వెలమ నాయకులు తెలఁగాదొరలూ — కాపులు గమ్మలు
గవరసెట్లునూ

కాటమరెడ్డి కంచారెడ్డి—కార్కానాలా గణపతిరెడ్డి
నాయకులును సామంతరాజులూ — నాయకహడీస్థళాలలోనూ
కాపులుగాచుచు నున్నారూ —

350 సేనాధిపతీ సింగమనేడూ
సితువరాల సింగమనేడూ
భండారి శ్రీ హరిహరూడూ
ఫణిహారీ శ్రీ బుక్కరాయడూ
ఉంబళికలలో నున్నారూ

355 ఏమి సేయమని యాజ్ఞాపించెదో
చెప్పవె తల్లీ శీఘ్రముగ
అని వేడుచునూ యడుగులబడిన
కుమారునెత్తి కౌగలించినది
శిరమును మూర్కొని శ్రేయము గోరుచూ

360 ఎక్కినదీ విభ్రమమించుకలేకా
ప్రతాపరుద్రా భయపడరాదురా
ప్రాణాపదకూ పాతాదువురా
బ్రాహ్మణులున్నా ర్భయమేలనోకో
నియ్యోగులున్నా ర్నిల్పుటకూ
సంస్థానమును జెడనీయకురా
నిలువద్రొక్కుమురా నా తండ్రీ
అని పల్కుచు నాజ్ఞాపించెను
ఇందులూరి శ్రీ యీశ్వరయ్యను

370 ఆతని యనుజుని యన్నమదేవుని
పెంపెక్కిన పినతల్లి భర్తనూ

371 సంధికి బొమ్మని సరగుననే—

మరియు నిజ్ఞానతిచ్చినది. 'అల్లావుద్దీన్ కఱకు దురక'—
ఇది భారతీయులందఱు నెఱిగినదే — ఈయా భాషణము
మీరెరుగనిదికాదుగదా—
అల్లావుద్దీన్ సురత్రాణే
వసంధిర్నచ విగ్రహే
సంధౌ సర్వస్వ హరణం
విగ్రహే సర్వనిగ్రహం.
ఈ యాభాషణమును విస్మరింవకుడు.

375 రత్నాంబరములు లక్షలున్నవి
కూర్చిన ధనమునకు గొదువలేదుగద
సైన్యములున్నవి జనులున్నారూ
రాయరాజ్యము గలదుగదా

380 ఏమి యీ నగునో యిచ్చివేయకుడూ
సంస్థానమును జెడనీయకుడూ
జాగుసేయకా సరగున జనుడూ
ఆజ్ఞాపించీ యంపినది.

* *

నూఱుకరులునూ, నూఱులక్షల
ధనసంచయమును దాళితోడను
పీతాంబరములను పొంబట్టులునూ
387 స్వారాట్టుకీదగిన స్వర్ణభూషలును
ఢిల్లీ సుల్తాన్ దేవిడికీ
ప్రతివర్షమునూ బంపుటకూ

400 ఒప్పవచ్చిరి వైరుల నంపి
రాజమాత శ్రీ సన్నిధికీ
రాజమన్నను రమణతో గొందిరి
మూతిజుట్టుల ముదుసద్దిలూ
నకారగుడులా నియ్యోగులూ
405 నెలటూరు శ్రీ వెంకటరమణుని
రాయనామ చరితావలిలో

---

ద్వితీయ్య మగునాశ్వాసం బియ్యది
ఆదిపర్వమను ప్రథమపర్వమున
నో ప్రజలారా యో జనులారా
410 మహనీయాంధ్ర మహాజనులారా

## రాయునావు చరితావళి
## ఆదిపర్వము తృతీయాశ్వాసము

ముమ్మడమ్మ కనుమోడ్చినదీ
స్వర్గసీమకు సాగినదీ
ఆయమతోడనె యాంధ్ర స్వతంత్రము

414 యంతరించిపోయినదీ
కాకతీయుల కడపటి రాజా
ఢిల్లీ తురకకు నల్లాసామికి
దాసుఁడగుచు దలవంచెనయా
తీరాంధ్రము సింహాద్రి మొదలుగ

420 సిహరికోట చేరువవఱకు
తురకలచేతికి దొరకెనయా
కోటల బేటల గుడ్లనుగడ్ల
పందిబావుటా పడిపోయినదీ
అరబీ తురకల యర్ధశశాంకుడు

425 పొడమూపెను పూర్వాంధ్రమంతటను,
సుల్తాన్‌పూరు చుట్టువట్లను
వేలుపుగొండ వీరసీమలో
నల్లగొండలో నాగార్జునమున
రాజుకొండలో రహమత్పూరులో

430 దేవరకొండలొ తెలగగూడెమున
రాజేశ్వరమున రామగిరిశిఖరి
నుండెన కాళేశ్వరమందును
ఇందూ ర్బృహుధాన్య నగరములు
తెలంగాణ తీరాంధ్రమువఱకును

435 నర్ధశశాంకుం డాడెనయా
శ్రీకూర్మమున సింహాచలమున
విశాఖ పురమున విజయనగరిలో
బెబ్బులులకు నావాసభూమి యగు
బొబ్బిలికోటలో భువనేశ్వరమున

440 రాజారములో రాజమంద్రిలో
విజయవాడలో వీరేశ్వరమున
కొండపల్లిలో గొండవీటిలో
మచ్చెకంటి దర్వాజా కలిగిన
మచిలీ బందరు పట్టణంబున

445 స్కందనగరిలో గండనవీటిలొ
ఉదయాచలమున నుప్పరిపల్లిని
సింహవిక్రమ శ్రీపట్నంబున
సింగరిరాయని కొండమీదను
ఘండికోటలొ ఘనగిరితటమున

450 బళ్లారి పురమున బొనుగంటిలో
ఆనెగొందిలో హంపాపురమున
ఆంధ్రదేశమున నంతటనూ
హిందూరాజ్యము యేట గలసెను
దోర్దర్పముగల తురకల దౌలతు
దుర్భరమై పొడసూపెనయా
నేంటూరి శ్రీ వెంకటరమణుని
రాయనామ చరితావళిలో
నాదిపర్వమున నాశ్వాసంబూ
మూడోదింతట ముగిసెనయా

460 ప్రజలారా యో ప్రజలారా
జనులారా యో మనులారా

## రాయునావు చరితావళి
## చతుర్థాశ్వాసము

అల్లావుద్దీన్ సుర్రతాణుడూ
అరిగెను అల్లా పదసేవకునూ
మల్లికాఫూ ర్మరాటివాడూ

465 మహాద్రోహమున కొడిగట్టెన్
హాలాహలమును హర్రపేరితుడై
షిరాజ్‌నుండి షేకులు తెచ్చిన
షరాబును షర్బత్తున గలిపి

త్రాగనిచ్చెనయ ధైర్యముతో

470 రెండుగ్రుక్కలు త్రాగినంతటనె
రెప్పలు రెండును మూసుకొనెన్
ఆనందాబ్ధిని యల్లలనాడుచు
అల్లాపదసేవకు జనియెన్
ఉస్సుస్సురని యూపిరివిడుచుచు

475 స్వర్గ్యలోకమున కేగెనయా
హౌరీలందరు నాతని చుట్టును
మూగిరయా కడు మోదముతో
నట్టహాసముగ నాడుచు పాడుచూ
కేలుకేలను బట్టి గింజాచు

480 దేవదూతమ్మె కేలుదేవిడికి

481 దీసుకపోయిరి తీవ్రముగా

463 బంగారు కడితమును బజాచినడూ
ఖయ్యూమత్తక్కబరుస్తానులో
నుండువచ్చును నోటమిలేక
యూజ్ఞాపించి యంపినడూ
ఇంతలోపలన యింటి ముంగిటిలో |

రేగెను వెనుగల్లత్తొక్కటి- రిచ్చవడగనుహౌరీకన్యలు
పెనుబొబ్బలు పేరార్భులతోడను

470 యీడ్చుకవచ్చిరిస్వాన్శూరులను
హిందూస్థానమునుండీ -
ఇంకా వచ్చుచునున్నార్లేవా
ఇసా న్ సిపాహీలు నాయకులూ
కాఫరులనూ ఖతల్జేసిరట
కాఫరీల జెలబటి రటా
ము రక్షా మూర్ఖశిరోమణి
ఖుస్రూఖాన్ గోహంతకుడూ
ఘయ్యాజుద్దీన్ ఘరోనా తురక
పిచ్చిరాజులలో బేర లవాడు

480 నూమూదూ బిన్ తుగ్లాకు సహా
ఏమియాజ్ఞయని యడిగినంతటనె
పదడు పదడూ పదడయ్యా
అల్లాసామిని యడుగుదవ
అని వారందఱు దొడ్కొనుచు వెగమె

485 యల్లా సన్నిధి కరిగెన్

# నర్తించే చైతన్యజ్యోతి

## "రాగమాలిక రఘురూప"

**ఆ**లోచనలు కదిలే రూపం లేని జీవాలు
స్పర్శ కందని ద్రవానుభూతి నాల్గవ పరిమాణం.
నాలో నాదికాని బిందువు విశ్వానిది.
వినిపించని వింతశబ్దపుగాలి—అక్కడే-మొదటిఊపిరిపీల్చి

చుట్టూ పరిధి నతిక్రమించకుండా పాకి
మనసును మసకగా అంతరింపజేస్తుంది.

ఆత్మ అవురావురుమంటూ జీవంలేని చీకటిని వాటేసుకుని
అంతటినీ తాకీ ఆరని మెరుపు తృప్తిని ప్రసవించి
అందులోనే కరిగిపోతుంది –

"నర్తించే చైతన్యజ్యోతి"
నిశ్శబ్దించే అనంత భావగీతి

# భాషా, ప్రాసా, సామాజిక ప్రయోజనమూ - కవిత్వంలో

## శ్రీ నాగరాజు సురేంద్ర

మనో నిక్షిప్త భావాలకు మధురభాషా రూపకల్పనే కవిత్వం. భాష మధురమైనదిగా ఉండాలనేది ఇక్కడ గమనార్హం. అలా కాని పక్షాన కవిత్వం అనేది అసలు మృగ్యమై అది కేవలం భావ వ్యక్తీకరణగా మాత్రమే మిగిలిపోయే ప్రమాదముంది. కవిత్వంకూడా ఒక రకంగా భావ వ్యక్తీకరణే అయినా భావ వ్యక్తీకరణ మాత్రమే కవిత్వం కాదనే విషయాన్ని అందరూ గుర్తించాలి. మధురమైనభాష అంటే తప్పనిసరిగా అది క్లిష్టమైన పదాలనూ, ఎక్కువ శబ్దాన్నిచ్చే మాటలనూ కలిగిఉండాలనుకోవాల్సినఅవసరం లేదు.అలాఅనిఅట్లాంటి పదాలేవీ భాషా మాధుర్యతకు కంట్రిబ్యూట్ చేయలేవని భావించడం కూడా పొరపాటే అవుతుందిమరి. నేటి కవుల్లో చాలామంది ఈ సత్యాన్ని గ్రహించకపోవడం శోచనీయం. కవిత్వానికి అవసరమైన గుణాలన్నిటిలోనూ భాషా మాధుర్యతకే ప్రయారిటీ దొరుకుతుంది.

అత్యాధునికమైన సమకాలీన వచన కవిత్వాన్ని సమగ్రంగా పరిశీలించి చూస్తే అందులో భాషా మాధుర్యత లేకపోవడం అనే లోపం కొట్టొచ్చినట్టుగా కనిపిస్తుందనేది నిశ్చితంగా నిర్వివాదాంశమే. ఈ రోజుల్లోని వచన కవిత్వం శాబ్దిక సౌందర్యానికి ప్రాధాన్యత నివ్వక పోవడంలో "మాత్రమే" అభ్యుదయ భావకవిత్వాలకు భిన్నంగా ఉండడాన్ని (అంటే మరేవిధంగానూ వాటికంటె పైచేయిని కలిగిఉండక పోవడాన్ని) ఒక ప్రత్యేకతగా భావించి నేటి కవులు దాన్నొక గర్వకారణంగా తలపోయడం నిజంగా దురదృష్టకరమైన విషయం. భాషలో నిరాడంబరతను ప్రవేశపెట్టడానికి అవసరమైనదానికంటె ఎక్కువ ప్రాధాన్యతనివ్వడంద్వారా కవిత్వంలో సరళత్వాన్ని సాధించవచ్చుననే ఒక తప్పుడు అభిప్రాయం నేడు కవుల్లో ఎక్కువగా ప్రబలిపోతున్నది. కానీ సులభమైన భాషను సంతరించుకున్న నేటి వచన కవితలోకూడా అబ్స్క్యూరిటీ ఎక్కువగానే ఉండడం అనేది భాషా సారళ్యత ద్వారా కవిత్వంలో సరళత్వాన్ని సాధించడంయొక్క అనిశ్చితత్వాన్ని దృఢపరుస్తుంది. సులభమైన భాష కూడా కవిత్వంలో అస్పష్టత చోటుచేసుకునేందుకు దోహదకారిగా ఉన్నప్పుడు ఈ భాషా నిరాడంబరతకు ఇంతటి ప్రాముఖ్యత నివ్వవలసిన అవసరం ఉండగూడదు. కవిత్వంలో సులభత్వం ఉండడానికి అతి నిరాడంబరమైన భాషను వాడడం అనేది ఒక రూల్‌గా పరిణమించగూడదనేదే ఈ వ్యాసకర్త యొక్క అభిప్రాయం.

"శబ్దం చూపుడువేలు అనుభూతి
చంద్రుణ్ణి చూపిస్తే మూర్ఖులు
వేలినే చూస్తారు,
రసరాట్టులు రాకాశశిని అవలోకిస్తారు" అన్న అరిపిరాల

విశ్వంగారి మాటలు 'మంచి' భాషను కూడా వాగాడంబరతగా భ్రమించి ఆరోపించేవాళ్ళకు కనువిప్పు కలిగించేట్టుగా ఉన్నాయి.

"మాటలు పేర్చడమే కవిత్వం అయితే
పలకగల ప్రతి పక్షీ కవే అవుతుంది" అని వారే చెప్పడం కూడా నేటి యువకుల్లో చాలామంది గుర్తించదగింది.

మరో దురదృష్టకరమైన విషయ మేమిటంటే వచన కవిత్వాన్ని విరివిగా రాసేస్తున్న నేటి కవుల్లో చాలామంది పద్యాన్నీ ఛందస్సునూ నిరసిస్తూ, వాటి అనావశ్యకతను బలపరచడం అనేది వారికి దాన్ని అనుసరించడానికీ అర్థంచేసుకోవడానికీ గల చేతకాకపోవడాన్ని కప్పిపుచ్చుకోవడం కోసమే చేయడం జరుగుతున్నది. ఇది చాలా హాస్యాస్పదమే అవుతుంది మరి.

ఛందోబద్ధమైన కవిత్వంద్వారా కూడా వచన కవిత్వంద్వారా సాధించగలిగే సరళత్వంలాంటి ప్రతి ఉద్దేశాన్నీ అంతకంటె ఎక్కువ సంతృప్తికరంగా నెరవేర్చవచ్చుననేసత్యాన్ని గ్రహించకుండా నేటి యువ కవులు చాలామంది పద్యాన్ని నిరసిస్తున్నారు. అయితే ఛందస్సులాంటి నియమాలుండాల్సిన అవసరం లేదనేవారి ప్రతిపాదన ఎక్కువవరకు న్యాయమైనదే ఐనా పద్యం అనేది పూర్తిగా అనవసరమైనది కాదనే వాదన కూడా సరయినదే. ఆశయ సాధనలో వచన కవిత్వంలో ఏ విధంగానూ భిన్నం కాని, ఏ విషయంలోనూ తీసిపోని పద్యాలకు కూడా అనావశ్యకతను ఆపాదించడానికి కేవలం ఛందస్సు మాత్రమే కారణం కాకూడదనేదే ఇక్కడ చెప్పదలచుకున్నది.

కవిత్వంలో ప్రాసకుండాల్సిన స్థానాన్ని గురించి కూడా తర్జన భర్జనలు ఎక్కువగానే సాగుతూ వచ్చాయి. అయితే ప్రాస ఉండడానికీ ప్రాస "మాత్రమే" ఉండడానికీ చాలా వ్యత్యాసముందనేది అందరూ గ్రహించదగింది. అంత్యప్రాస కోసం పంక్తుల్లోని అర్థరు లైన్సును ధ్వంసం చేసి రచనలోని నడకను పూర్తిగా వక్రగతిని పట్టించే కవుల 'వ్రాత'ల్లో ప్రాస మాత్రమే కాకుండా మరేముంటుంది? అట్లా కాకుండా మంచి కవిత్వానికి ప్రాసను ఒక అదనమైన ఉపకరణగా వాడుకోవడం ఎంతో ఉచితంగా ఉంటుందనేది ఇక్కడ సుస్పష్టం.

కవిత్వంతో సామాజిక ప్రయోజనం యొక్క అవశ్యకతను గురించి గత కొన్ని దశాబ్దాలుగా ఎక్కువగానే వినబడుతున్నది. కవితా రచన చేసేవాళ్లలో ఈ రకమైన దృక్పథం పొడసూపడం నిజంగా హర్షనీయమే. కానీ ఇది సామాజిక ప్రయోజనం లేని ఏ రచనా కవిత్వం కాదనుకునేదాకా రావడం మాత్రం నిస్సంశయంగా గర్హించదగిందే. సామాజిక ప్రయోజనం ఉన్న ప్రతిదీ కవిత్వంకాదు. అట్లాగే సామాజిక ప్రయోజనం లేకపోయినంతమాత్రాన కవిత్వం కాకుండా ఉండిపోవాల్సినఅవసరంలేదు. అంటే ఒక రచన కవిత్వం కాకపోవడానికి సామాజిక ప్రయోజనం లేకపోవడం మాత్రమే ముఖ్య కారణం కాకూడదన్నమాట. ఒక్క మాటలో — కవిత్వాన్ని కొలవడానికి సామాజిక ప్రయోజనం ఒక యూనిట్ కాకూడదు. సామాజిక ప్రయోజనం అనేది కవిత్వానికి సెకండరీ మాత్రమే.

సాంఘికమైన ఉపయోగాన్ని సాధించే నిమిత్తం కవిత్వంలో క్వాలిటీ లేకపోవడాన్ని ఓవర్‌లుక్ చేయడం అనేది కవిత్వం కవిత్వం కాకుండా ఉండిపోవడానికి దారితీసేదాకా పోవడం ఎంతైనా విచారించ దగింది. ఈవిధమైన ప్రమాదాన్ని కొనితెచ్చుకోవడం అనేది కవిత్వంతో ప్రయోగం చేయడంవల్ల జరిగినంతగా మరింకేదానితో ప్రయోగం చేయడంవల్లా జరగదు. కథ, నవల, నాటకం లాంటివి సామాజికప్రయోజనార్థమై ఎంతగా ఉపయోగించుకోబడడం జరిగినా క్వాలిటీ తగ్గిపోవడానికి అవి కవిత్వం ఇచ్చినంతగా అస్కారాన్నివ్వవు. పైగా సాహిత్యంద్వారా సాధ్యమయ్యే బహుకొద్ది సామాజిక ప్రయోజనంలో కథ, నవల, నాటకం మొదలైనవాటిద్వారా జరిగే ప్రయోజనంతో పోల్చిచూస్తే కవిత్వం ద్వారా లభ్యమయ్యే ప్రయోజనం ఇంకా చాలా తక్కువ. సాంఘిక ప్రయోజనానికి అంత తక్కువ అవకాశాన్నిచ్చి నాణ్యత తరిగిపోవడానికిమాత్రం ఎక్కువ అస్కారాన్నిచ్చే కవిత్వాన్ని సామాజిక ప్రయోజనార్థమై ప్రయోగించుకునేటప్పుడు కవిత్వంయొక్కస్థాయి దిగజారిపోకుండా జాగ్రత్తపడవలసిన బాధ్యతను మరచిపోవడం క్షమార్హం కాని నేరం.

1969లో జరిగిన అభ్యుదయ సాహిత్య సదస్సులో సామాజిక ప్రయోజనాన్ని గురించి పాలగుమ్మి పద్మరాజుగారన్న మాటలు పునశ్చరణీయాలు.

"సాహిత్యం ద్వారా సామాజిక ప్రయోజనం అనేది (ఒకవేళ) జరిగితే నా అంతగా సంతోషించేవాడుండడు. కానీ అలాంటి ప్రయోజనం జరగడం అనేది అనుమానాస్పదమే" ఇంచుమించు ఇదే విధంగా ఉండినవారి వాక్యాలు చాలావరకు సహేతుకమైనవే. మౌలికంగా సాహిత్యం ద్వారా జరిగే సామాజిక ప్రయోజనం గణనీయమైన పరిమాణంలో ఉండదనేది మాత్రం వాస్తవం. సాహిత్యంలో సామాజికతను ప్రతిబింబింపజేయడం ముదావహమనే వాదం ఎంతగా ఆమోదయోగ్యమైనదైనా సామాజికతను ప్రతిబింబింపజేయడం ద్వారా కవిత్వం గణనీయమైన సామాజిక ప్రయోజనాన్ని సాధించగలుగుతుందనుకోవడం మాత్రం అసమ్మతమైనదే. కవిత్వం లీసుకు రాగలిగే ఈ సామాజిక ప్రయోజనం యొక్క నెగ్లిజిబిలిటీని ఒప్పుకోవడానికి నేటి చాలామంది కవులు వెనకా ముందాడుతారు.

ఏది ఏమైనా ఈ సామాజిక ప్రయోజనపు బలిపీఠంమీద సాహిత్యపు విలువలు ఇలా అంతరించడం అనేది ఎంతవరకు అభిలషించ దగిందో అందరూ ఆలోచించాలి.

సాహితీ రంగంలో రోజు రోజుకూ వెర్రితలలు వేస్తున్న ఈ పోకడలు మాయమై నాణ్యతగల రచనలు వెలువడాలని ఆశిద్దాం మరి.

# వెన్నెలకుప్పలు

**శ్రీ దిలావర్**

వెండి సెలయేటి పులినతలం గుండెలమీద
వెల్లకిలా పడుకున్నప్పుడు–కళ్లు చదలేటి వెలుతురులో
స్నానాలు చేస్తున్నపుడు, గత చరిత్రను వెదుక్కుంటూ
పరుగులు తీశాయి జ్ఞాపకాల చకోరాలు !

ఆభీరకుమారులతో కేళాకూళుల
చెలిమి తీరాల చలుదు లారగిస్తున్నపుడు
అనుకున్నానా, పోతన్న మా గురించే
రాస్తాడని, గానం చేస్తాడని?

బాధ్యతలకు ఎగనామం పెట్టి
బాల్యసరోవరంలో ఈదులాడుతూన్నప్పుడు
భావించానా, సరస కవితా సరిత్తరణం
చేయవలసి వస్తుందని?

ఉత్సాహం దసరా పద్యాలు వల్లెవేస్తున్నపుడు
మామిడితోపుల్లో కోతికొమ్మచ్చు లాడుతున్నపుడు
గుండెల్లో నీలాటిరేవులు గుసగుసలాడుతున్నపుడు
రెండుజడలసీత కొంటెచూపులతో
గిలిగింతలు పెట్టి కిలికించితాలకు, లంగరువేస్తున్నపుడు
యక్షుని విరహార్త సందేశాలు మోసుకుపోయే
వలాహకాల తొందర నడలవైపు
వెర్రిగా చూడటంతప్ప ఏ అనుభూతు లందుకొన్నాను?

మొయిలు చెంచిత చెవిలో
మెరుపుగోగుపూవుకోసం
అర్రులు సాచడంతప్ప, ఏ అందాల
సొకట్టుకొన్నాను, అనుభవించాను?

చంద్రకలశంనుంచి కుశలంగా ఒలికిన
వెన్నెలసోనలలో అందాల ఆడపిల్లలతో
అలుపెరుగక వెన్నెలకుప్ప లాడుతున్నపుడు
కించిత్తయినా భావించానా చిత్తంలో?—
చంద్రుణ్ణీ తారల్నీ పుప్పొడిచేసి
సాంద్రజీవన మకరందంలో ముంచి రంగరించి
ఆ రసాయనంలో మెదిపిన వన్నెల అక్షరాలు
మనస్సుమాంజలిలో పేర్చి
వెన్నెలకుప్ప లాడతానని??

# విజ్ఞాన నిలయాలుగా విద్యాలయాలు

నేటి విద్యార్థులే – రేపటి పౌరులు.

నీతి, నిజాయితీలు, క్రమశిక్షణ, పనిలో ఆసక్తి కలిఉండటమే ఉత్తమ పౌరుని లక్షణం.

ఆ లక్షణాలు సిద్ధింపచేయటమే విద్యాలయాల కర్తవ్యం.

ఇప్పుడు క్రమశిక్షణ, ప్రశాంత వాతావరణం విద్యాలయాలలో నెలకొన్నవి. పరీక్షలలో అవినీతిని తొలగించడం వలన విద్యార్థులలో విజ్ఞాన ఆసక్తి పెరిగింది! ఉపాధ్యాయుల సమస్యలను పరిష్కరించడం వలన విద్యాబోధన మెరుగయింది. విజ్ఞాన నిలయాలుగా విద్యాలయాలను రూపొందించడం దేశ ప్రగతికి సమాజ శ్రేయస్సుకి తోడ్పడడమే.

దేశం సుభిక్షంగా వుండాలనే ప్రధాని యిరవై సూత్రాల పథకం ప్రవేశపెట్టారు.

దేశంలో అన్ని రంగాలలో ప్రగతి సాధిస్తేనే సర్వ జనులకు సుఖ శాంతులను కల్గించగలం.

విద్యాలయాలు విజ్ఞాన నిలయాలుగా రూపొంది, విజ్ఞానవంతులు, ప్రతిభావంతులు తయారయి వివిధ రంగాలలో ప్రగతి సాధించ గల్గినవాడే ఇది సాధ్యం.

క్రమశిక్షణ, పనియందు ఆసక్తి, దీక్ష కలిగిన ఆదర్శవంతులైన పౌరులను తయారుచేయడమే మన లక్ష్యం.

ఈ లక్ష్య సాధనకు విద్యార్థులు, ఉపాధ్యాయులు. తల్లిదండ్రులు, మేనేజిమెంట్లు సంయుక్త కృషిచేసి విద్యాలయాలను నిర్వహించటానికి తోడ్పడడమే కర్తవ్యం.

విద్యాలయాల సక్రమ నిర్వహణకు పన్నెండు సూత్రాల పథకాన్ని అమలు జరిపి విద్యాప్రగతి సాధిద్దాం

**మండలి వెంకట కృష్ణారావు,**

ఆంధ్రప్రదేశ్ విద్యా, సాంస్కృతిక శాఖ మంత్రి.

నెం. 36/DIPR/75-76.

శ్రీకాకుళం జిల్లా ముఖలింగం :

# మధూకేశ్వరుని దేవి - వారాహి?

**శ్రీ జి. ఆర్. వర్మ**

తెలుగు ప్రపంచ మహాసభా కార్యక్రమాలు – నేను శ్రోతనుకాను, ప్రేక్షకుడనూకాను. ఆసందర్భంలో ప్రచురితమైన వ్యాసాలు చూచాను. తెలుగు వారి శిల్పకళగూర్చిన ఒక వ్యాసంలో కళింగరాజులు గాంగులు, మధూకేశ్వరుడు, శ్రీకాకుళంజిల్లా ముఖలింగంగూర్చి కొన్ని పంక్తులున్నాయి. ముఖలింగేశ్వరుడు అనబడుచున్న మధూకేశ్వరునికి ఒక దేవి ఉన్నట్లూ, ఆ దేవి పేరు వారాహి అని చదివి చకితుడ్నయాను.

ఈ క్షేత్రంగూర్చి వ్రాసిన సిద్ధహస్తులైన గిడుగు, జయంతి, రాళ్లభండి, భావరాజు, మారేమండ వారి భావాలేగాదు ఆమధ్య "భారతి" రెండు సంచికల్లో వేసిన నా వ్యాసాలుకూడా సవరించదగిన వనుకొంటున్నాను. అనేకులు దర్శించని నూతనాంశాలు సచిత్రంగా చూపేయత్నం నే విరమించలేదు.

ముఖలింగం వెళ్లిన రెండు సార్లూ (15 ఏళ్లక్రితం) ఉన్నది కొన్ని గంటలు ఫొటోలు తీసుకోడంలో సరిపడినా, ఉత్తర ప్రాకారాని కంటియున్న విరుదేవళంలో అమ్మవారిగూర్చి శ్రద్ధచేయక పోయినా, అక్కడెవరూ దేవునికో దేవి ఉన్నదనీ, ఆమె ఈ గుడిలో నున్న అష్టభుజాదేవిఅనీ, ఆమెపేరు వారాహిఅనీ అనలేదు. క్షేత్ర మహాత్మ్యంలో, సాహిత్యం, స్థానిక గాథలు, శాసనాల్లో ఆ ప్రసక్తిలేదు.



ఒరిస్సా వారాహి

మధుకేశ్వరాలయ వరహావతారం

ముఖలింగం ఒకప్పుడు శాక్తేయ క్షేత్రంఅని భావించే మిత్రుడు శ్రీ పంచాది భీమేశం అష్టభుజాదేవిని మహాసరస్వతి అయ్యిండునంటే కావచ్చు లక్షణాలన్నీ మహాసరస్వతిగా కన్నాను

చూచి చాలా కాలమైనది, ఉన్న ఫోటో అస్పష్టంగా ఉన్నది. సందేహ నివృత్తికై జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల్లో ఎగ్జిక్యూటివు ఆఫీసరు శ్రీ జి. నారాయణరావు జాబువలన ఈ అష్టభుజాదేవిని 'కిరాత వారాహినీ' అని జనులూ, 'రాజరాజేశ్వరి' అని పండితులంటున్నట్లు తెలిసినది.

నా సందేహాలకు వారి సమాధానాలు– ఒడిలో బిడ్డలేదు, మహిష చిహ్నంలేదు, కోరలులేవు, సూకర ముఖికాదు. సప్తమాతృకల్లో ఉన్న వారాహి పోలికల్లేవు అంటూ ఎనిమిది చేతుల్లో పైనుండి క్రిందికి ఉన్నవి. ఎడమ చేతుల్లో 1. త్రిశూలము, 2. విల్లు, 3. ఘంట, 4. డాలు; కుడిచేతుల్లో 1 ఖడ్గము, 2. చక్రము, 3. శక్తి, 4. కుడి యురువున హస్తము చాచియున్నది. పార్శ్వాన దండం లేదన్నారు.

పై లక్షణాలు వారాహివా? రాజరాజేశ్వరివా? కిరాత వారాహివా? తెలిసినవారు వ్రాయగలరు. ఉన్న ఫొటో భూతద్దంలో చూడగా ఈ అష్టభుజాదేవివద్ద సింహమున్నది, దేవి పద్మపీఠంపై ముఖాసిన చేరువ మరోరెండు 'శాల్తీ'లు అస్పష్టం.

ఈ దేవిని రాజరాజేశ్వరీ అనడానికే ఆధారాలు, పోలికలులేవు. కళింగ గాంగుల్లో క్రీ. శ. 11వ శతాబ్దంనుండి రాజరాజు అనే పేరిట రాజులున్నారు. సామ్రాజ్యవాదపు కాంచీపుర చోళరాజరాజు పేరు వేంగి, కళింగరాజులు వాడుకున్నారు. కళింగగాంగుల్లో ముమ్మడి రాజరాజు ప్రశస్తి–క్రీ. శ. 11వ శతాబ్దపు దేవేంద్రవర్మ తొలి రాజరాజులు–వీరి పేర్లెరిగిన పండితులు (?) రాజరాజేశ్వరీ అంటున్నారేమో! ముఖలింగక్షేత్రం గూర్చిన కథలూ, మహాత్మ్యల్లో తర్గాలు, వ్యక్తులు పేర్లు వగైరా క్రీ. శ. 12వ శతాబ్దంనుండీ ఉన్న రాజులు, రాజబంధువులవిగా ఉన్నాయి.

శుంభుని జంపిన మహాసరస్వతి అష్టభుజమే గౌరి అన్నారు

పరిశోధకులు. ఈ ప్రతిమా లక్షణాలు కొన్ని పోలికల్లేకపోలేదు. మహాసరస్వతి లక్షణాలు:

"ఘంట శూల హలాని శంఖు హోసలే చక్రం ధనుః సాయకం
హస్తై ర్విధతీం ఘనాంత విలసిచ్ఛీతాంశు తుల్య ప్రభావం"

ఇవన్నీ ఈ ప్రతిమలోలేవు. ఎగ్జిక్యూటివు ఆఫీసరు అన్న 'ఉరుపున...' వరదహస్త లేక ధ్యానముద్ర కావచ్చును. వారాహీ వగైరా ఉన్న ఈ ముఖలింగ దేవీమూర్తి కుడి రెండో చేతిలో నున్నది 'చక్రం' కాదు అక్షమాల. శిల్పంలో జపమాల జారినట్లుగాక వలయాకారమున ఉండుటను. ఇది పురాతన మహామాతా మూర్తుల 'కడియం' మార్పు అయినా కావచ్చును.

మధూకేశ్వరాలయంలో పార్శ్వానగాని, మరేచోటగాని ఆయన దేవి అంటూ వివరూ ఏ ప్రతిమనూ పూజించలేదు – పత్నీభావమూ లేదు. పంచాయతన పద్ధతిలోఉన్న గుడి ఏనాటిదో, నిర్మాత ఎవరో తెలియదు. ముమ్మడి (మధు) కామార్ణవుడు (క్రీ.శ. 1019–38) కట్టించాడనే జనవాక్యంఉంది. అతని తర్వాత రాజు అనంతవర్మ ముమ్మడి వజ్రహస్తునినాటి నుండీ ఉన్న ఆలయ శాసనాల్లో ఎక్కువగా (క్రీ. శ. 12 వ శతాబ్దంనుండీ ఉన్నవి. మధూకేశ్వరాలయ ప్రశస్తి వివరాలెక్కువగా ముమ్మడి వజ్రహస్తుని పౌత్రుడు అనంత వర్మ చోడగంగదేవుని శాసనాల్లో ఉన్నాయి. ఈగుడి ఒక్క రాజునాటి దనిపించదు. పరిశోధకులు క్రీ. శ. 8–10 శతాబ్దాల మధ్యదన్నారు. శిల్పంలో గుప్త, బాదామీ చాళుక్య, భువనేశ్వర పద్ధతులతోపాటు దక్షిణ కోసల గుప్తుల ఆలయాల ఛాయలూ ఉన్నవి. ఆనాటి దేవుని పేరేదో తెలియదుకాని ఇదే చోట క్రీ. శ. 6–7 శతాబ్దాలనాటి గుడి ఒకటి ఉండేదని బుజువుచేయ యత్నిస్తున్నాను.

పంచాయతన సంప్రదాయంలో సాధారణంగా శివాలయాలలో ఉత్తర ప్రాకారాన కోటి వాయువ్య – ఈశాన్యాలకున్న ఆలయాల మధ్యగా శక్త్యాలయం ఉంటుంది. తమిళనాడు విష్ణ్వాలయాలకూ ఈపోలిక ఉందట. ఆ చిన్న గుడిలో ప్రధానదైవం పురుషుడైతే స్త్రీ, స్త్రీ అయితే పురుషుని ప్రతిమ సాధారణము. వారినే క్షేత్ర పాలకు లనుట కద్దు.

గ్రామస్తులు గుడికి ఈశాన్యంలో దూరంలోఉన్న 'రత్నగిరి' పైనున్న పద్మనాభస్వామి క్షేత్ర పాలకుడంటారు. నేచూడలేదు. ముఖలింగం ఒకప్పుడు శక్తిక్షేత్రం అనుకోడం సంగతి ఏమైనా ఒకప్పుడు జైన, బౌద్ధాలకూ, గిరిజనారాధ్యదైవానికి నెలవు అవే ఆధారాలున్నవి. వీటిని శివ, విష్ణు క్షేత్రాలుగా గాంగులు మార్చారు.

శ్రీకాకుళం ప్రాంతాలు కొంతకాలం ఓఢ్రులూ పాలించారు. ఒకనాటి రత్నగిరి విహారం వజ్రయానానికి పట్టుకొమ్మ. ఆ రత్నగిరి



మధుకేశ్వరాలయ కుడ్యశిల్పం    సోమేశ్వరాలయ కుడ్యశిల్పం

పేరు ముఖలింగం చేరువ కొండకిచ్చారేమో! సాని హుండాలో వజ్రయాన శిథిలాలున్నవి. ముఖలింగంలోనూ శుహసుఖశార బౌద్ధముండేదేమో!

కళింగలో తొలిగాంగులు, కళింగ కదంబుల కులదైవం గోకర్ణేశ్వరుడు, జయంతీశ్వరుడు–వారి శాసనాల్లో దేవునికి దేవిలేదు, పరిశోధకులు గోకర్ణేశ్వరుడు మహేంద్రగిరివాసి. ఆ గిరి గంజాంజిల్లా మందాసా అన్నాడు. పడమటి కనుమలకు ప్రాంతీయమైన చాలాపేర్లున్నట్లే తూర్పుకనుమలకు తెలుగునాట నల్లమల, విక్రమల, పాపికొండలు, శ్రీగిరి, మహేంద్రగిరి అనేపేర్లు. మందసా కనువర్తించినట్లే మహేంద్రగిరి ముఖలింగానికీవర్తించును. స్థల, ప్రాంతీయ శాసనాల్లో మధుకేశ్వరుడన్నది మలిగాంగులు. వీరి శాసనాల్లోకూడా మధూకేశ్వరునికి దేవిలేదు. వారాహీ మధుకేశ్వరుని పత్ని అనడానికి ఆధారం ఏమిటో ?

చిన్నగుడిలో పద్మపీఠంపై ఉన్న దేవి సుందరమూర్తి. ఆయుధాలు అవీ ఉన్నా సౌమ్యరూపి. ఈమెకు వారాహి, రాజరాజేశ్వరి లక్షణాల్లేవు.

వారాహీ లక్షణాలు సర్వజన విదితము. కుడ్యశిల్పంలో సప్తమాతృకలున్నారు. అందులో వారాహీ ఉన్నది. అంతటా ఉన్నట్లే కృష్ణవర్ణ, సూకరవదన, పాలిండ్లు పెద్దవి, బొజ్జఉన్నది. బహుపురాతన కాలంనుండీ ఇతరదేశాల్లోకూడా సూకరం సారంలో బుతు సూచకమూ, ఇలపై భాగ్యదేవత, సస్యాధిష్ఠాన దేవి. ఉర్వరతంత్ర (ఫెర్టిలిటీ) సందర్భంగా ఎలుకవలె పంది సంతానంకూడా ఎక్కువ. ఇతరదేశాల్లోకూడా త్రిగుణాత్మక రూపాల్లో మూర్తి శీర్షాని కిరువై

పులా సింహ, సూకర వదనాలున్నవి. అమ్మవార్లగూర్చి "మైలార దేవ, గుడీ గుంపా" రెండు పుస్తకాల్లో వివరించాను. పందులు బుడగరించిన నేల దున్నకుండా సాగుచేయడం ఒకనాటి వ్యవసాయ పద్ధతి.

శ్రీకాకుళం జిల్లా సాలిహుండా (సాలిపెటక) బౌద్ధక్షేత్రంలో తాంత్రిక బౌద్ధసౌరశక్తి మరీచి త్రిశీర్ష. ఈమె రథాన్ని లాగేవి సప్తాశ్వాలు. ఇదే దేవతరథం లాగేవి టిబెట్‌లో సప్తసూకరాలట. సాలిహుండా మరీచి ముఖాలు పోల్చలేనంతగా పాడైనవి. శైవ, వైష్ణవాల్లోనూ సూకర ప్రసక్తి ఉన్నది.

ఆలయ శిల్పాల్లో వారాహీ సప్తమాతృకలతో ఉండుట సర్వ సాధారణము. శక్తిపీఠాల్లో ఒకటైన ఉజ్జయినిలో ఉన్న వారాహీ వివరాలు సేకరిస్తున్నను.

క్రీ. శ. 12వ శతాబ్దంనుండీ కళింగ గాంగులు పరమ భాగవతులు. ఆ ఛాయలు, శిథిలాలు నగరికటకం గ్రామాన ఉన్నాయి. ముఖలింగ గ్రామాన జైన, బౌద్ధ శిథిలాలున్నవి. ఉన్న మూడూ శివాలయాలె. నగరికటక ముఖలింగ గ్రామాలు పరిసరాలు ఒకనాటి కళింగ గాంగుల రాజధాని కళింగనగరి, నగరికటము.

శివాలయాల్లో సాధారణ సంప్రదాయము—శివశక్తులు. గుడిలో లింగమూర్తిశిరం — పానవట్టం యోగశక్తి సాంకేతిక రూపము. ఈ యోనిలింగ సాంకేతికరూపం పోలికే శివపార్వతీ అనంతరతి



ప్రరి సింహవాహనీదేవి చోడగంగుశాసనంలో బగవతియా ?

శిల్పము—మధూకేశ్వరాలయ ప్రాకారంపై గుడికెదురుగా గుప్తసాంప్రదాయపు అనంతమైథున శిల్పమున్నది. వారు ఆది దంపతులు, చరాచర సృష్టికర్తలనే విశ్వాసమేగాని అశ్లీల భావంకాదు. మధూకేశ్వరుని గుడిలో ఈ భోగశక్తి భావానికి రూపకల్పనకాదు— మరో సాంకేతిక రూపమూ అనిపించే చిహ్నాలు మధూకేశ్వరమూర్తికున్నాయి. శివుని భోగశక్తి శివలింగ పార్శ్వాన నిలచిఉంటే ద్విభుజ, ఆసీన భంగిమైతే చతుర్భుజ—మధుకేశ్వరుని చేరువలో భోగశక్తిలేదు. ఉత్తర ప్రాకారానికంటె వేరుగా చిన్నగుడిలోఉంటే క్షేత్రపాలికేగాదు శివుని వీరశక్తి బహుభుజగా ఆమెనే శివుని భోగశక్తి అన్నారు. గుడి ఉత్తర ప్రాకారానికున్న అష్టభుజాదేవి శివుని వీర—భోగశక్తి-పత్ని అంటే శాక్తేయాల్లో భైరవుడు భర్తఅన్నట్లుగా—ఆక్షేపణ ఉండదు. మధూకేశ్వర-శివపత్ని వారాహీ ఆధారం ఏమిటీ అని ప్రశ్న.

అష్టభుజామూర్తులు, పేర్లూ చాలా ఉన్నాయి. వారి చేతుల్లో ఉన్నవాటిబట్టి ఫలానా అనే నమ్మకము—ఆ నమ్మకాల్లో (ఆగమ) అసలు తాంత్రిక బౌద్ధాలఅనే పరిశోధకాభిప్రాయం ఒప్పుకుంటాను.

గుడిలో అష్టభుజాదేవి చేతుల్లో వీరలక్ష్మి కుండాల్సిన పాశ, అంకుశ, అక్షమాల, అభయ, వరద, గదా, పద్మ, పానపాత్రలు. కాబట్టి ఈమె వీరలక్ష్మికాదు (శాక్తేయ) మహాసరస్వతీకాదు. అష్టభుజాదేవిలు అనేకులున్నారు. దుర్గ, మహాలక్ష్మి, చాముండా, శూలినీ వగైరా. ముఖలింగం గుడిశిల్పాల్లో ఈ ఉత్తర ప్రాకారానికంటియున్న గుడిలోనేగాక ఇతరంగా అష్టభుజామూర్తులున్నారు. శూలినీక్కూడా సింహలాంఛనమున్నది. "హరివంశ" ఆర్యాయా దుర్గ—శబర, పులిందాదుల ఆరాధ్యదేవత. శబర, పులిందాదుల సంబంధం ముఖలింగానికీ ఉన్నది. సముద్రగుప్తుడు లిచ్ఛవీ దౌహిత్రుడనని సగర్వంగా ప్రకటించుటలో జారీ చేసిన నాణెములపై బొమ్మఒకటి శ్రీ—లక్ష్మీ—సింహలాంఛనీ. మధూకేశ్వరాలయ శిల్పాల్లో మరో అష్టభుజామూర్తి (ఉత్తర ప్రాకారపు గుడి గూటిలో) బగళా (ముండమాలినీ)చాముండ మరో రూపం-మధుకేశ్వరాలయంకెదురుగా ప్రాకారంపై మరో అష్టభుజాదేవి సింహవాహని ఉన్నది. ఈమెను "కళింగదేశచరిత్ర"లో రచయితలు జైన చక్రేశ్వరి అనడం సరికాదు. మధుకేశ్వరాలయ కుడ్యశిల్పంలో (తూర్పుగా) మరో అష్టభుజాదేవి పల్లవశిల్పం పోలికల్లో మహిషమర్దని ఉన్నది. కర్నాటకమున చాముండియే మహిషమర్దని. ఈమె కామరూపిణి, బహురూపిణి.

'దేవీ మృగవాహినీ' శీర్షికలో ఈ దేవతలగూర్చి "ఆంధ్రపత్రిక" ఉగాది సంచికలో వ్రాసియున్నాను.

వారాహీ సప్తమాతృకల్లో ఒకామె ప్రాణా (ఆయురి)భిష్టాన దేవి, దక్షిణ దిక్పాలకి/రక్షకి, వరాహ వదన, కృష్ణవర్ణ మహిషలాంఛనీ

పీనోదరి, పీనకుచా ఒడిలో బిడ్డ - మహామాతాలక్షణాలు. యమాంశ యమీ యమ్యా అన్నారు. చాముండ యమస్యభగినీ. మహారాష్ట్ర వెలూరక విహార బౌద్ధక్షేత్రంలో పిమ్మటివారు నిల్పిన ఏకవీర (రేణుక) సుందరి నీ యమాయి అన్నారు మరాఠీ, ఆయి మాతృ భావం పోలికలు ఇతర దేశాల పేర్లు "గుడిగుంపా" పుస్తకంలో వివరించాను.

సప్తమాతృకల్లో చాముండ (షష్ఠిదేవి) కువట, కౌమారికి ఉదంబర, వైష్ణవికి పిప్పల, ఇంద్రాణికి కల్ప దుమ రక్కన దేవత రేణుక అంటువ్యాధుల దేవతగా భగవతికీ నింబవలెనే వారాహీకి కానుగ (కరంజ) చెట్టు పవిత్రము.



సప్తమాతృకలు దాక్షారామ

వారాహినిని యమ్యా అన్న హేమాద్రి ఆమె కపాలపాణీ, దండపాణీ, జగన్మాత అన్నాడు. ఒరిస్సా భువనేశ్వర్ మ్యూజియంలో యమిలీ వారాహీ లక్షణాలే వరాహ ప్రమేయం అంతటా వారాహి కున్నది. దండనాథ వారాహీ స్వర్ణ పద్మపీఠంపై అష్టభుజాదేవి. ఐతే పార్శ్వంలో రాజచిహ్నమైన దండముండును. ముఖలింగ 'వారాహీ, కిరాతవారాహి'కి పద్మపీఠం ఉన్నదేగాని వారాహి లక్షణాలు సూకరప్రసక్తి, పీనోదరపయోధరాలులేవు. సుందరి, **సింహమధ్యగా** ఉన్నది. స్వప్నవారాహి చతుర్భుజ, సూకరముఖి లేక వరాహ దంష్ట్రి కానిలాంఛనం అశ్వం. శుద్ధ వారాహి చతుర్భుజ, సూకర దంష్ట్రి.

బౌద్ధుల భట్టాలీ శాస్త్రీయ వారాహికి చాలా పోలికలున్నవట. భట్టాలీ గూర్చి నాకేమీ తెలియదు. నేపాళ వారాహి రక్తవర్ణ, దిగంబరి, రుధిరాసక్త, ముక్తకేశని, త్రిలోచని, ప్రత్యాలీఢ పాద, ముండమాలిని, ఖట్వాంగ/వచోపాణి, పాదాల క్రింద కాళరాత్రి, భైరవుడుండునట– ఈ పోలికలు ముఖలింగం దేవికిలేవు. తాంత్రిక బౌద్ధ ప్రతిమా లక్షణ తెరిగినవారు వివరించదగినది. వజ్రవారాహి చిహ్నాలు ముఖలింగం ఆసీన **దేవతకులేవు. వజ్రవారాహీ ఆసీనభంగి** మున్నదా?

ముఖలింగం – మధూ కేశ్వరాలయం వివిధ కాలాల్లో నిర్మితము. మధూకేశ్వరుని కులదైవంగా చెప్పకున్న కళింగరాజులు మలిగాంగుల. **శాసనాల్లో**గూడా ఆయనకో దేవి ఉన్నట్లు చెప్పకోలేదు.

మిత్రుడు **శ్రీ భీమేశం సేకరించిన ముఖలింగం రాగిపత్రా** శకశీర్ష 999 నాటిది. క్రీ. శ. 1077/8 లో అనంతవర్మ చోడ గంగదేవుడు పట్టాభిషిక్తుడైన **సంవత్సరంలో జారీ అయిన దాన** శాసనం – ఈరాజు శాసనాల్లో – కొర్ని శాసనం పిమ్మటికాలానివి. (క్రీ. శ. 12 వ శతాబ్దం) **వాటిలో ద్వితీయ కామార్ణవుని నాటి** రాజధాని నగరి (ముఖలింగ నగరి కటక) లో మధూకేశ్వరు డున్న ట్లున్నది. ఇప్పచెట్టు **సంబంధమున్నది. ముఖలింగ (శక. 999)** శాసనంలో చోడగంగు రాజ్యరక్షక దేవతను పేర్కొన్నాడు ... భగవతి నగర పుర వాటికా...గంగాన్వయ రాజ్యాధి దేవతా.. అన్నాడు భగవతి సాధారణంగా దుర్గ. కళింగ పట్నం సముద్రతీరాన్ని చూచినప్పుడు దీర్ఘాసి భగవతిని (వనపతి శాసనంలో భగవతి) మర్చిపోయాను.

సౌర–సృష్టి - వ్యవసాయభావాల్లో వరాహముండినట్లే అనేక దేశాల్లో పద్మమున్నది. జీవానికి సాంకేతికము. కేరళ రైతులో, పొలాల్లో పద్మాలుతెచ్చి కలిపివేయడం ఆచారం ఉండేది. పంటసిరి పద్మం శాకేయానిది-ఉర్వర తంత్రనుండి ఏర్పడిన పావిత్ర్యం– ఇతరదేశాల్లోనేకాదు మనదేశాన శాక్తేయ, బౌద్ధ, వైష్ణవాల్లో పద్మమున్నది– శైవంలో అరుదు –

ముఖలింగం శివక్షేత్రం మధూకేశ్వరాలయం ఉత్తర ప్రాకారపు గుడిలో అష్టభుజాదేవి, సుందరి పద్మస్థితాగా ఉన్నది.

**శబరాది గిరిజన ప్రదేశం అనుకోడంలో** 'కిరాతవారాహీ' అన్నారా? శ్రీకాకుళంజిల్లా ముఖలింగ ప్రాంతం పూర్వం కోలు వర్తని, వరాహ వర్తనీ ప్రాదేశిక నామము. జలాధారం (వంశధార నది) తో శతాబ్దాలనుండీ వ్యావసాయక భూములున్న ప్రాంతం వరాహ వర్తనీ – కాబట్టి దేవి వారాహా (వ్యవసాయం) అన్నారా?

ఏ శాసనంలోనూ మధూకేశ్వర పత్నీ ప్రసక్తి లేదు. ఉత్తర ప్రాకారపు గుడిలో పద్మపీఠంపైనున్న ప్రతిమలో సూకర ప్రసక్తి లేదు – మధుకేశ్వరుని కో దేవి, ఆమెపేరు వారాహా అనడం ఆధారాలు – తెలిసినవారు వ్రాయగోరెదను.

ఈ చిన్నగుడిలో ఉన్న పద్మపీఠస్థ అష్టభుజాదేవి నేడు ప్రతి మాలాక్షిణికులూ, పరిశోధకులూ ప్రుంగడగిన కుడ్య శిలా **ఫలకా ఉన్నవి.**

అనియుంక భీమేశ్వరాలయ క శిల్పాలో నిలచియున్న **అమ్మవారి చేతిలో అక్షమాల ఉన్నది. తలపై పాము పడగలున్నవి**

# శృంగారనైషధ సర్వంకష

## కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

శృంగారనైషధమునకు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు 1913లో సర్వంకష వ్యాఖ్యానము వెలయించిరి[1] — అదే 1961లో పునుర్ముద్రితమైనది. దానిపై విమర్శలు వెలువడినవి[2]. నేడా సర్వంకషకూలంకషముగా సంస్కరణము నపేక్షించుచున్నది. అందు కొన్నింటిని ప్రదర్శించుటయే యీ వ్యాసోద్దేశము.

## (1)

శ్రీరామా కుచమండలీ మృగమద శ్రీగంధ సంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు, ధరణీ సంశ్లేష సంభావనా
పారీణుండు కృతార్థు జేయుఁగరుణాపాథోదిపద్మాక్షుఁడిం
పారన్ మామిడి పెద్ద మంత్రి సుతు సింగామాత్య చూడామణిన్—

(i) శృంగారరస ప్రధానమైన నైషధకావ్యమునకు తద్రస స్ఫోరకముగా కృత్యాదిని శ్రీనాధుడు తొలిపద్యమున-శ్రీ కుచమండలముతో ప్రారంభించినాడు. కృతిముఖమున కుచ సంప్రదాయమునకు శ్రీనాధుడే మూలపురుషుడు.

శ్రీనాధునికి ముందీ సంప్రదాయమున్నదిగాని అది గ్రంధ మధ్యమందున్నది.

నన్నయ-శ్రీ లలనాస్తన ఘటితవి
శాలోరస్థల (అది. 4-1)
కేతన — శ్రీ స్తనమండనమేదుర (దశ. 10-1)
నాచన సోమన — శ్రీ సర్వమంగళాకుచ
(ఉహరి. 1-1) (2-1) (3-1)

ఉత్తరహరి వంశము తిక్కన భారత కధానంతరము. అందువలన అవతారికలేదు.

నాచన సోముని వసంత విలాసమున కృత్యాదిని నీ క్రింది పద్యము గలదు—

శ్రీ చన్నుంగవ కేవ క్రొమ్మెఱుఁగులన్ శృంగారపుందోఁటకున్
ప్రాచీనంబగుచున్న వింశతి నఖప్రౌఢిన్ సుఖావాప్తి వే
లా చంద్రోదయమైన దేవుఁడు కృపాయత్తైక చిత్తంబుతోఁ
జూచున్ మాచయ బ్రహ్మధీమణి కవిస్తోమైక చింతామణిన్‌కి

ఈ వసంత విలాసమునకు సంస్కృత మూలమున్నది ఆ సంస్కృత మూలములో నీ భావమున్నదేమో పరిశీలింపవలసి యున్నది. ఈ గ్రంధము లభ్యముకాదు. లక్షణ గ్రంధములనుండి 3 పద్యములు దొరుకుచున్నవి— సోముడు శ్రీనాధునికి పూర్వుడు.

శ్రీనాధునికి కొంచెము పూర్వుడైన జక్కన విక్రమార్క చరిత్రమున నీ సంప్రదాయము పాటించినాడు.

"శ్రీ గౌరీకుచ నీలమౌక్తిక మణిశ్రేణీ విభూషాఘృణి ప్రాగల్భ్యంబులు—"

శ్రీనాధునికి ముందిట్లు కవులిద్దఱు కుచసంప్రదాయముతో కావ్యప్రారంభము చేసినను—దానికి తాను తన కృతులలో పాటించి, తర్వాతి కవులనుసరించునట్లు సర్వాతిశాయిగా ప్రచారమునకు దెచ్చినది శ్రీనాధుడే. ఆతని కృతులలో చూడుడు.

హరవిలాసము—"శ్రీ మహిళాపయోధర హరిన్మణిహారము"
భీమఖండము—"శ్రీ స్తనగంధసార పరిషేకసమంచేతసాయక"

శివరాత్రి మాహాత్మ్యము — "శ్రీ గౌరీస్తన గంధసార ఘుసృణ శ్రీవాసిత"

కాలము గడచిన వెనుక-కడపటి కృతియగు కాశీఖండమున—

"శ్రీ కాశీనగరాధి రాజ్యపదవీ సింహాసనాధ్యాసి" అని ఎంతో ఔచిత్యమును పాటించి పై సంప్రదాయము విడిచిపెట్టినాడు. శ్రీనాధుని సమకాలికులు, తరువాతివారు నీ కుచ సంప్రదాయమును ఆతని ననుసరించి పాటించినారు.

అనంతుడు— "శ్రీ రమణీపయోధర పరిస్ఫుట కుంకుమ"— భోజరాజీయము.

"శ్రీరామా స్తనమండలీ మిళిత కాశ్మీరార్ద్ర"— ఛందోదర్పణము.

తరువాతి వారు:

| | | |
|---|---|---|
| సంకుసాల నృశింహకవి. | శ్రీరామా వసుధా పయోరుహములన్ | కవికర్ణ రసాయనము |
| హరిభట్టు | శ్రీకాంతాకుచహార కౌస్తుభమణి | వరాహపురాణము |
| మాదయగారి మల్లన | శ్రీ వక్షోరుహ శాతకుంభ | రాజశేఖర చరిత్ర |

ఆ వెనుక క్రీ. శ. 1850 వఱకు కవులీ సంప్రదాయము పాటించినారు.

విస్తరభీతి వానినీయలేదు.

(ii) విష్ణుస్తుతియందు శ్రీదేవిని భూదేవిని యిద్దఱను ప్రవేశపెట్టినవాడు శ్రీనాథుడు-

అల్లసాని పెద్దన మనుచరిత్రయందలి తొలిపద్యము శ్రీనాథుని పద్యమునకు ప్రతిబింబము—

శ్రీ వక్షోజ కురంగ నాభమెదపైఁజెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమునఁ బ్రీతిన్నిల్పినాడో యనం
గా వందారు సనందనాది నిజభక్త శ్రేణికిందెల్పురా
జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్

(iii) శ్రీనాథుని పద్యమున "పద్మాక్షు" డనునది సాభిప్రాయము.

విష్ణువు శివుని ప్రతిదినము వేయి కమలములతో పూజించెడివాడు. ఒకనాడు పూజలో కమలమొకటి తక్కువయ్యెనది. వెంటనే ఆతడు తన కన్ను పెఱికి — ఆ కన్నుతో వేయి పూరించి పూజ చేసెనాడు. శివుడాతని భక్తికి మెచ్చి—కన్నునిచ్చుటయేకాక, చక్రమును ననుగ్రహించెను. నాటినుండియు ఆతడు కమలాక్షుడయ్యెను—

"ద్వి. జడజాంబకుండుల సద్భక్తి యుక్తి
తప్పక వేవేసి తామర విరుల
నెప్పుడుగొనివచ్చి యేకాగ్ర బుద్ధి
నొక్కొక్క దివ్యనామోచ్చారణమున
నొక్కొక్క కమలంబు నుగ్రుఁబూజించి
సరియథాస్యాత్తద సంభవమ్మనగ
దర శ్రుతుల్ "నేత్రముత్పాత్య" నానంః
నొక్కనా డందొండు తక్కువ పడఁగ
గ్రక్కున తన నేత్ర కమల మర్పించి
చక్రంబు కన్ను నీశ్వరుచేత భక్తి
నిక్రమం బేర్పడ విష్ణుండు బడయు."

(పండితారాధ్య చరిత్ర మహితము. 184 పుట)

నన్నెచోడని కుమార సంభవమున విష్ణు స్తుతిలో (1-4) పై విషయము గలదు

# (2)

"కనకక్ష్మాధర ధరంబు కార్ముకముగాఁగదద్రూతనూజుండుశిం
జినిగా మాధవుఁడమ్ముగా పురము లక్ష్యమైకదోశ్శక్తి
గార్చిన జోదీశ్వరుఁడు".

తా. పటిష్టమైన యాయుధముఁతోను బాహుబలముతోను త్రిపురాసురులను నాశమొనరించిన యీశ్వరునియొక్క కరుణ. శివుని యాయుధములు కేవలము పటిష్ఠములు మాత్రమేకావు—

త్రిపురాసుర సంహారమున శివుని ఆయుధము లతిలోక సామాన్యమైనవి. అవి ప్రకృతి విరుద్ధములు, విపరీతములు విల్లు వంచుటకు వీలులేని మేరు పర్వతము – వింటినారి సాగదీయుటకు వీలులేని ఆదిశేషువు — ఆదిశేషువు చుట్టలుగానుండి భూమిని తలపై ధరించును—అతడు కదిలిన భూమి కంపించును — విష్ణువు అమ్ము—బాణము—బాణము సూటిగా, ఒకేదిక్కు పోవలెను–విష్ణువు సర్వవ్యాపి–ఏ దిక్కున నెచ్చటనుండునో తెలియలేము—సాధనములు విలక్షణములు.

ఇట్టిలోక విరుద్ధ సాధనములతో త్రిపురాసురులను జయించుటయే శివుని మాహాత్మ్యము — దీనిని శైవ కవులందఱు బహుభంగుల కీర్తించిరి–పై పద్యమునకిట్టి వ్యాఖ్య యావశ్యకము.

ఈ పద్యమున 'కార్చిన' అను పాఠముండుట సుతరాము సరికాదు.

అది 'గెల్చిన' అనియే యుండవలెను.

అమంగళకరమైన—'కార్చిన' అను పదము — కృత్యాదియందు శ్రీనాథుడేకాడు మఱి యేకవియైన వాడునా ? — దీని నేనింతకు ముందు చూపితిని. (భారతి అక్టోబరు 1963)

# (3)

హాటక గర్భుచేత — ఈ పద్యమున కమలాసనుచే, చతుశ్శ్రుతిచేత సరోజుచే, సూత్రుచే—అని అన్నియు తృతీయా విభక్తులేగలవు—

ఇట్లొకే విభక్తి ఒక పద్యమున పాటించుట సంప్రదాయము. నైషధ మున కొన్నిచోట్లగలదు (1–37 తృతీయ, 1–46 ప్రథమ, 7–63 ప్రథమ)

జగన్నాటకసూత్రి–సూత్రిపదము అమరమునలేదు –

సూ. ని లో సూత్రి–సం. ఎణ. న్. నీ. న్. 1. దారములు కలది. 2. నిబంధనలు గలది.

సూత్రి. సం. వి. ఇ పుం. కాకి అని కలదు.

(పుట. 1087. ఏడవ సంపుటము)

సూ తుడు అనునర్థమున సూత్రిపదములేదు.

'సూత్రుచేత' అనునదిసరియగు పాఠము.

## (4)

"జేజేయంచు భజింతు నిష్కఫల సంసిద్ధుల్ మదింగోరి ని ర్వ్యాజ ప్రౌఢకృపావలంబుని కటప్రస్యందిదానాంబునిన్ బూజాతర్పిత దేవదానవ కదంబున్......

(i) కృపకు 'ప్రౌఢ' అను విశేషణ ముండునా ?
"ని. ర్వ్యాజాపార కృపావలంబుని" అని యుండవలెను.
(ప్రబంధమణి భూషణ పాఠము–1వ పుట)
17వ శతాబ్ది

(ii) పూజాతర్పిత దేవదానవ కదంబున్
ఈ పదబంధము కేతన ననుసరించినది
"తేజోరాజిత సర్వలోకునకు......
రాజీవాప్తున కాగను పఠిత...కీర్తికిన్.
పూజాతర్పిత రాజశేఖరునకున్." (దశ 1.192)
రెండూ శార్దూల వృత్తములే-
రెండింటియందు మూడవపాద ప్రారంభము సమానమే.

## (5)

సరస్వతిస్తుతి–సీసపద్యము– శ్రీనాధునికిముందు కవులు సర స్వతి స్తుతియందు సీసపద్య ముపయోగింపలేదు. శ్రీనాధుడు భీమ ఖండమున సరస్వతిస్తుతి సీసపద్యముననే చేసినాడు. తర్వాతి కవులు శ్రీనాధుననుసరించిరి.

## (6)

ఇంతవఱకు త్రిమూర్తులు గణపతి సరస్వతి మాత్రమే స్తుతింపబడినారు. లక్ష్మి పార్వతి స్తుతులిందులేవు.

## (7)

సంస్కృతాంధ్ర కవిస్తుతి : ఇందు వ్యాసవాల్మీకులు, బాణ మయూరులు, భాససౌమిల్లకులు, మాఘభారవులు, కాళిదాసు, రాజశేఖ రుడు, కవిరాజా అను సంస్కృతకవులు పేర్కొనబడిరి.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱన (శంభుదాసు) తెలుగుకవులు;
సంస్కృతకవులు – 11. ఏకాదశరుద్రులు
తెలుగుకవులు – 3. ప్రణవమున మూడుమాత్రాలు

గీ. భారతస్థాక్షరక్రమ పదులగుటనొ
భట్టు పెగ్గడ క్రతుకర్త భారతమును
తెనుగు చేసిరటంచు నుతింతు వారి
ప్రణవముననుండు మూఁడు మాత్రలుగ మువురకొక్కొండ
బిల్వేశ్వరీయము.

## సంస్కృత కవిస్తుతి

కాలక్రమమున శ్రీనాధుడు పేర్కొన్న కవులిట్లుందురు

వాల్మీకి ఆదికవి : కాశీఖండమున నొకపట్టున రామాయణాను సరణము గలదు.

వ్యాసుడు : భారత పురాణకర్త. స్కాందపురాణము (కాశీ ఖండము)

కాళిదాసు : హరవిలాసమున–పార్వతీకల్యాణము 3–4 ఆశ్వాస ములు. కుమార సంభవమున–4, 5, 6, 7, 8 సర్గలకు సంగ్రహము. ప్రథమసర్గలోని హిమ వద్వర్ణన–5వ ఆశ్వాసమున మొదటి పలుబది రెండు పద్యములలో నున్నది.

భాససౌమిల్లులు : వీరు కాళిదాసు సమకాలికులు. కాళిదాసు ననుసరించి తాను స్తుతించినాడు. అంతే.

బాణుడు : బాణుని కాదంబరిని శివరాత్రి మహాత్మ్యమున ననుసరించినాడు.

మయూరుడు : కాశీఖండమున మయూరుని సూర్యశతకము నుండి 16 శ్లోకముల ననువదించినాడు.
సంస్కృతకవులలో మయూరుని హెచ్చుగా ననుసరించిన కవి శ్రీనాధుడే.

భారవి : శ్రీనాథుడు ధనంజయ విజయము అను కావ్యమును రచించినాడని తెలియుచున్నది. నేడది కాన రాకున్నది. అది భారవి కిరాతార్జునీయమున కనువాదమై యుండనోపును.

మాఘుడు : మాఘుని పేర్కొనుటలో విశేషమున్నది— శ్రీనాథునికిముందు సాహిత్యలోకమున పంచ కావ్యములకు హర్షనైషధముచేర్చి షట్కావ్యములుగా వ్యవహారము. వానికి లఘుత్రయి, బృహత్త్రయి అనిపేర్లు. లఘుత్రయి, 1. కుమార సంభవము. 2. రఘువంశము. 3. మేఘసందేశము.
బృహత్త్రయి : 1. కిరాతార్జునీయము. 2. శిశుపాలవధ, 3. హర్షనైషధము.

రాజశేఖరుడు : కావ్యమీమాంస, బాలరామాయణ నాటకాది కర్త. శ్రీనాథుడు భీమఖండమున నీతని నొక పట్టున యనుసరించినాడు. 4

కవిరాజు : ఇది కవిపేరే—ఈతడు సంస్కృత రాఘవ పాండవీయకర్త. 4

నైషధము శ్రీహర్షకృతి కనువాదము. అయినను నిందు భవభూతి, మురారి, బిల్హణుడు. వీరి యనుకరణములు గన్పట్టుచున్నవి. శ్రీనాథుడు వీరిని స్మరింపలేదు.

నైషధమునకు తరువాతిదైన హరవిలాసమున సంస్కృత కవిస్తుతి గాని తెలుగు కవిస్తుతిగానిలేదు.

శ్రీనాథుని సంస్కృతాంధ్ర కవిస్తుతినిగూర్చి ప్రత్యేకాధ్యయనమావశ్యకము.

# (10)

"పంచాంగస్థిర మంత్ర రక్షణ కళా ప్రౌఢుండు, బాలా మనః
పాంచాలుండు విరించివంశ జలధిప్రాలేయభానుండు"...

రెండవపాదమున "విరించివంశ జలధి ప్రాలేయబానుండు" అనునది కేతననుండి గ్రహించినది—

"పారావార పరీత విశ్వవసుధా బాగంబునన్ గీర్తికా
ధారంబై వెలుగొందువాడతుల సత్యత్యాగశీలంబుఁ
బారీణుండు—విరించి వంశ వనధిప్రాలేయ భానుండు"—
(దశ. 1—118)

# (11)

(i) "మృదుమధుర చిత్రవిస్తరకవితా విలాసు వాగీశ్వరులైన కవీశ్వరులు."

నన్నయ — మృదుమధుర చిత్ర విస్తర నవరస భావభాసుర కవితా రచనా విశారదులు—(అది. 1-8).

ప్రకాశక విజ్ఞప్తి (పుట. 15) లో దీనికి "మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవులు" అను పాఠమున్నదని వ్రాసినారు — ఈ సందర్భమున — సంశోధిత మహాభారత ముద్రణములో (4 పుట) 27 ప్రతులలో 'వచన' అను నది లేదని కలదు. నన్నయ కవితను జీర్ణించుకొన్న శ్రీనాథుడు నన్నయ ననుసరించియే దీనిని వ్రాసినాడు (చూ. సాహిత్యసమీక్ష పుటలు 318-320) (మృదు) ఆశు, మధుర, చిత్ర, విస్తరము లనెడు చతుర్విధ కవితా సంప్రదాయము ప్రాచీనమైనది — తమిళమున 'యాప్పిరంగళ్' కారికలలో క దు — (చూ. తెలుగు కవుల చరిత్ర పీఠిక. 15)

ఇది సంస్కృత సంప్రదాయముకాదు. దేశి సంప్రదాయము.

(ii) "విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతులగు కళావంతులు"—

కళావంతులు అను నీ శబ్దము శ్రీనాథుడు తిక్కననుండి గ్రహించినాడు.

క: నీ వింత యలుగనేటికి
... ... ... ...
ఆవంత ద్రిక్కకుండ క
ళావంతులు మత్పతులు గలరు పగదీర్పన్
(భార. విరా2-161)

కళావంతుడు అను శబ్దమునకు 1. కళలలో నారితేరినవాడు 2. శక్తుడు; సమర్థుడు అను రెండర్థములు గలవు. శ్రీనాథుడు మొదట యర్థమున, తిక్కన రెండవ యర్థమున వాడినారు.

# (12)

"భారద్వాజ పవిత్ర గోత్రుని శుభాపస్తంబసత్సూత్రు"

(1) ఈపాదము "బారద్వాజ పవిత్రగోత్రు విమలాపస్తంబ సత్సూత్రు" అని యుండవలెను.

ఇందే (1-111) భారద్వాజ పవిత్ర గోత్రు విమలాపస్తంబసత్సూత్రు" అని గలదు (పుట 69)

(ii) "నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి" — ఈ పాఠము సరికాదు. కృతుల నంకితముగా గొనుటకు కవిని రావించినపుడు — "పిలిపించి" పిల్వంబంచి అనియే వ్యవహారము —

శ్రీనాథుడు భీమఖండమున — "ఇట్లు పిలిపించి సన్మాన మెసక మెసగ" (1–22)

కాశీఖండమున "అవ్విభుడు నన్ను పిలువంబంచి" (1–11)

జక్కన విక్రమార్క చరిత్ర — "కొలువు గూర్చుండినను వేడ్కఁ బిలువఁబంచి ఇతడు శ్రీనాథునికి కొంచెము పూర్వుడు. తరువాతి వారు—

| | |
|---|---|
| తెనాలి రామకృష్ణ కవి | నను రామకృష్ణ కవి |
| పాండురంగమహాత్మ్యము | సూక్తి నిధిందిలిపించి (1–22) |
| రామరాజభూషణుడు | సంగీత కళా రహస్యనిధి బిల్వం |
| వసుచరిత్ర | బంచి (1–16) |

ఇంకను గలవు — తిమ్మకవి పాఠము

"శ్రీనాథాఖ్యుఁబిల్పించి" అనియే —

(iii) గంభీర వాక్ప్రౌఢిమన్ —

"ముగ్ధిమ ప్రౌఢిమ ఇత్యాదులందు ఇమనిచ్ప్రత్యయము మృగ్యమని వామినోక్తి" (పుట 9)

ఇచ్చటనేకాదు ఇందే (2–102) లో "లీలా ధురంధరతా ప్రౌఢిమయుంగ్వతజ్ఞతయు. అని ప్రౌఢిమశబ్దము ప్రయుక్తముకాగా —

"లీలా ధురంధరతా ప్రౌఢియునుంగృతజ్ఞతయు" అని ముద్రించి (పుట 137) వ్యాఖ్యలో (ప్రౌఢిమయున్ అని పూర్వ ముద్రణ (ప్రౌఢిమ శబ్దము సిద్ధింపదని వామనోక్తి) తిరిగి దీనిని గూర్చి వ్రాయఁబడి యున్నది. తెలుగుభాషా సంప్రదాయము ననుస రించి 'ప్రౌడిమ'నే కవులు ప్రయోగింతురు — శ్రీనాథునికి ముందు జక్కనలో.

"పురాణ ప్రౌఢిమన్ మించితిన్ (విక్ర. 1–110) అని ప్రయోగమున్నది. పింగళిసూరన ప్రౌఢిమ శబ్దమును శ్లేషలో నిటు బిగించినాడు.

"మాకుమారు ప్రావహో కార్చె నేడు నే
దైన ప్రౌఢి మహిమ భానుకులుఁడ"— రాఘ. (1–30)

రామాయణార్థము — ప్రౌఢిమ హిమభానుకులుఁడ —

భారతార్థము — ప్రౌఢిమ హిమభానుకులుఁడ —

ఇంకను ప్రయోగములు కలవు విస్తర భీతిని కొన్నింటిని చూపితిని.

# (13)

బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురు ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుండ వీశ్వరార్చన కళాశీలుండ వ్యుత్పత్తి
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నా భాగ్యంబు సామాన్యమే !

"తా: ఓ శ్రీనాథ పండితుఁడా! నీవు సరస్వతివలన వరము పొందిన వాడవు. ప్రతిభావంతుడవు. శివోపాసకుడవు. సకల పురాణ రహస్యమైన బ్రహ్మజ్ఞానమువలన బ్రహ్మానంద మనుభవించుచున్నా డవు. నీ యదృష్ట మితరులకు లేదు"— ఈపద్యమున విశేషము లున్నవి. 5

## ఈశ్వరార్చన కళాశీలుఁడు

ఇచట ఈశ్వర శబ్దము శైవాగమ సంప్రదాయకమైనది. "యస్మిన్నీశ్వర ఇత్యనన్య విషయశ్శబ్దో యథార్థాక్షరః" అని కాళిదాసు నిర్ణయము-శైవులకు పరమ ప్రమాణము.

ఈశ్వరార్చన యనగా శివార్చన—ఈ పదమంతకుముందు గలదు.

"యామము లెన్మిదింట నియతాకృతి ప్రత్యహమున్ శివార్చనా రామత యొప్ప (నృసిం. 1–16)

ఈశ్వరార్చన — అని శివార్చనకు వాడుట నన్నయ ననుసరించి నది. నన్నయ్య శివాగమములను ఈశ్వరాగమములన్నాడు.

"ఈశ్వరాగమముల బుద్ధి నిల్పితి"— (ఆది 1–12)

ఇట్లే బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ అనునది నన్నయ ననుసరించినదే.

"బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతు" (ఆది 1–9)

శైవులందఱు శివస్వరూపులు — మానవరూపశివులు. ఇక వారికి బ్రహ్మజ్ఞానమేమి? పురాణములను బేర్కొనుచు శ్రీనాథుడు బ్రహ్మజ్ఞానమని చెప్పినది ఈశ్వరజ్ఞానము. ఇదే శివజ్ఞానము.

"వరుస నిమిది యన్యదేవతలఁదెల్పు
పది పురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు
జంద్రమౌళి ప్రభావంబు సమధికముగ
శ్రుతులయట్లు పురాణ సంహితలునడుచు"
(కాశీ 1–73).

పై పద్యముననుసరించియే శ్రీనాథుడు — పురాణప్రసక్తి తెచ్చినాడు.

## (14)

క. జగము నుతింపఁ గఁజెప్పితి
  ప్రెగడయ్యకు నా యనుంగుఁబెద్దనకుఁ గృతుల్
నిగమార్థసార సంగ్రహ
  మగు నయ్యారాధ్య చరితమాదిగ బెక్కుల్.

"తా. నాయొక్క (అనుంగు=) ప్రియుఁడైన పెద్దన్న యయిన ప్రెగడయ్యకు (నిగమ=) వేదములయొక్క సారసంగ్రహమైన యారాధ్య (శైవులలోని పూజ్యులకు ఆరాధ్యులని వారి వ్యవహారము–వారి) చరితము మొదలుగా గల పెక్కు (కృతుల్=గ్రంధములను) లోకులు కొనియాడునట్లుగా అంకితము చేసితివి" (పుట10).

ఆరాధ్యచరితమనగా ఆరాధ్యుల చరిత్రమని యర్థముకాదు. అది ఒక్క ఆరాధ్యునిచరిత్రమాత్రమే తెలుపును-అదియే పండితారాధ్యచరిత్ర. పాల్కురికి సోమనాథుడు ద్విపదకావ్యముగా దానిని రచియింపగా శ్రీనాథుడా ద్విపదకావ్యమును పద్యకావ్యముగా రచించినాడు. భీమఖండమున–

గీ. నవమరుత్తచరిత్రంబు నైషధంబు
  సప్తశతి పండితారాధ్య చరితమనఁగ
  కావ్యములు పెక్కు చెప్పియు కాంక్షచనక
  వెండియును కావ్యమొకటి గావింపఁదలచి (1–17)

అని ఆరాధ్య చరిత్ర పండితారాధ్య చరిత్రగా చెప్పినాడు.

శ్రీ నాథునికి వెనుక పిడుపర్తి సోమనాథుడు తన పద్య బసవ పురాణమున పండితారాధ్య చరిత్రను "ఆరాధ్య చరిత" అనియే పేర్కొన్నాడు.

"సీ. పా. హరభక్తి ప్రశస్తైదికంబని శ్రుతులిడి చెప్పి
  ప్రతిభ సోమేశుఁడారాధ్య చరిత
సరవి శ్రీనాథుఁ డా చరిత పద్య ప్రబం
  ధముచేసి ద్విపదలు తఱచూనిలిపి" (1ఆ.పుట.3)

శ్రీనాథునిపై పండితారాధ్య చరిత్ర భావము హెచ్చు గాగలదు. అది వివరించుట కిదియదను కాదు.

## (16)

సీ. పా. కవిరాజ రాజశేఖర హీర మకుటంబు
  శ్రీ హీర కులవార్ధి శిశిర కరుఁడు

మూల గ్రంధకర్త శ్రీ హర్షుని వర్ణన — ఈ వ్యాఖ్యలో నిట్లున్నది : "శ్రీ హీర కులవార్ధి శిశిరకరుఁడు అను పాఠమున శ్రీ హీర కులమనెడు సముద్రమునకు చంద్రుఁడని యర్థము; కులమునకెల్ల కీర్తి తెచ్చినవాడని యబి పాయమైననుగాని శ్రీ హీర శబ్దము పితృనామమో కులనామమో తేటపడదు— తండ్రి యెవ్వడో తెలుపుట యావశ్యకము". (పుట. 11)

శ్రీహర్షుడు శ్రీహీరుడి కుమారుడని స్పష్టముగా నిట్లు శ్రీనాథుడు నైషధమునందే తెలిపినాడు.

౬. కలియుగంబునయందు కాశ్మీర భూమిలో
  మత్పీరమున ధరామరుఁడు పుట్టు:
శ్రీహీరుఁడనఁగ శేషాహి యంశంబున;
  నతఁడు మామల్లదే వ్యాఖ్యయైన
తన భార్యయలదుఁ జింతామణి మంత్రచిం
  తన ఫలంబుగ నొక్క తనయుఁగాంచు;
గర్వించు నతనివౌకాశ వాగ్దేవి తా
  శ్రీహర్షుఁడనియెడి చిహ్నానంబు— (6-25)

పై పద్యము వలన శ్రీహర్షుని తండ్రి శ్రీహీరుడనియు, తల్లి మామల్లదేవి యని తెలియుచున్నది

## (17)

చ. పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన చట హ
  ర్షుని కవితానుగుంభనము సోమరిపోతులు కొందరయ్యలౌ
  నని కొనియాడనేరరది యట్లైద: లేజవరాలు చెక్కుగీఁ
  టిన వసవల్పుబాలకుఁడు డెందమునంగరగంగ వేర్చునే.

మూలము. మల్లినాధ సూరి, భారవి ఘంటాపథ వ్యాఖ్య అవతారిక

"నారికేళ ఫల సమ్మితం వచో
భారవేస్సదిత విభజ్యతే
స్వాదయంతు వసగర్భ నిర్భరం
సామరస్య రసికా యథేప్సితమ్.

ఈ రెండింటి పరిశీలన ఆవశ్యకము.

ఘోరంబైన తపో విశేషమున సద్యోజాత వక్త్రంబునన్
గౌరీవల్లభు చేతఁబూజగొనియెన్ సుష్పర్వులం దొక్కఁడై
తారావీధి నలంకరించెఁగనియెన్ త్రయ్యార్థసంఘాతమున్
భారద్వాజ మహామునీంద్రుఁడగదే భక్తిం ప్రశంసింపఁగన్

"భారద్వాజ మహాముని ఘోరంబుఐన తపో విశేషమునన్.

గొప్పదయిన తపోతిశయము చేత (అనగా తాను గొప్పతపసు చేసి) అందులకు పరముగా గౌరీవల్లభుచేతన్=శివుని చేత సద్యోజాత వక్త్రంబునన్ (శివునికి సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అని అయిదు ముఖములు) అందు సద్యోజాతమనెడి (ప్రధాన) ముఖముచేత దీక్షన్ శైవదీక్షను కనియెన్ పొందెను. సప్తర్షులందున్—కశ్యపాదులైన ఏడుగురు సత్యవచనులలో వారెవ్వరనిన...

> కశ్యపో౽త్రిర్భరద్వాజో విశ్వామిత్రశ్చ గౌతమః
> జమదగ్నిర్వసిష్ఠస్య సప్తైతే ఋషయః స్మృతాః

తారావీథిన్=నక్షత్ర మార్గమును (సప్తరిషి చక్రము చరించునట్టి పరివహవాయుస్కంధము ననుట)...త్రయీ=వేదముల యొక్క అర్థ అభిధేయముల యొక్క సంఘాతమున్ రాశిని కనియెన్ చూచెను: ప్రశంసింపఁగన్=పొగడుట. (పుట 12-13).

ఇది భరద్వాజని వర్ణన=కృతిపతి సింగన మంత్రి గోత్రకర్త శ్రీనాదుడును భారద్వాజ గోత్రికుడే కావున కృతికర్త కృతిపతి సగోత్రికులు.

పై పద్యమున చెప్పబడిన విషయములు మూడు—

1. భారద్వాజుడు శివునిచే దీక్షగొనుట.
2. సప్తర్షులందొక్కడై తారావీది నలంకరించుట.
3. వేదార్థములను దర్శించుట.

మొదటి దానియందు "శివునిచే దీక్షగొనుట" అనుపట్టున శ్రీనాదుడు ప్రదర్శించిన ఆగమ పరిజ్ఞానము వ్యక్తము కాలేదు. శ్రీనాథుడు ఆగమ జ్ఞానఖని (హర 1-26) సప్తర్షులైన కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వసిష్ఠులలో—శివునియొద్ద దీక్షగొన్నవారైదుగురు మాత్రమే. వారు కశ్యప, అత్రి, భారద్వాజ, విశ్వామిత్ర, గౌతములనువారు. శైవమున—

1. అనాది శైవము
2. ఆది శైవము
3. పూర్వ శైవము
4. మిశ్ర శైవము
5. శుద్ధ శైవము
6. మార్గ శైవము
7. సామాన్య లేక స్మార్త శైవము
8. వీరశైవము అను ఎనిమిది భేదములు గలవు. వానిలో రెండవదియగు ఆది శైవమునకు సంబంధించిన ఋషులు కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతములు.

వీరి శైవ దీక్షను గార్గ్య చంద్రజ్ఞానాగమమిట్లు వివరించు చున్నది:

> "అది శైవాస్తు విజ్ఞేయాః కౌశికాద్యామహర్షయః |
> కౌశికః కశ్యపశ్చైవ భారద్వాజాత్రి గౌతమాః
> ఆదావేతే మహేశస్యపంచ వక్త్రేషు దీక్షితా
> గురోర్ముఖా దీక్షితాహి తద్గోత్రాశ్చాస్య గోత్రిణః
> అగమాంతోక్తవిధయా శాంభవవ్రతసేవినః
> కథాపునక్రియా బిభ్య దీక్షాత్రయ విధానతః
> లింగ త్రయ పరిస్ఫూర్త వంగత్రయ శోభినః
> అదిశైవా ఇతి భువి నిగద్యంతే బృహస్పతప్
> మహేశస్య ప్రతిష్ఠాయా ముత్సవేత్సవనారిషు
> ఆచార్యత్వేదధికృతా ఆదిశైవా జగన్నుతా (శివతత్త్వప్రకాశిక)

పై దానిని బట్టి

సద్యోజాత ముఖమునుండి భారద్వాజుడు
వామదేవ ముఖమునుండి అత్రి
అఘోర ముఖమునుండి గౌతముడు
తత్పురుష ముఖమునుండి కశ్యపుడు
ఈశాన ముఖమునుండి కౌశికుడు

శివదీక్షను గొనిరి. వీరిని పంచఋషులందురు.

ఈ పంచ ఋషిగోత్రజు లైదుగురకు లింగ ప్రతిష్ఠాపనాధికారమే గాక, ఇతర వర్ణముల వారికి శివదీక్షనిచ్చు అధికారముగలదు. ఆరాధ్యమత సంప్రదాయము ప్రవర్తిల్లజేసిన పండిత త్రయములో శ్రీపతి పండితుడు కౌశికగోత్రుడు. ఆయన వంశములో కాశీనాథయ్య అత్రేయ గోత్రుడు 7

ఆరాధ్య సంప్రదాయము సుప్రతిష్ఠితము చేసిన మల్లికార్జున పండితా రాధ్యులు గౌతమ గోత్రులు.

పంచఋషులలో నొకడైన భారద్వాజుని గోత్రమువాడుగావున శ్రీనాధుడు ఆరాధ్యశైవ సంప్రదాయ ప్రవర్తకుడై తన కృతులలో దానిని ప్రపంచించినాడు. ఆతని కృతికి (నైషధమునకు) పతి మామిడి సింగన (మంత్రి—భారద్వాజీయుడే) ఆరాధ్య సంప్రదాయకుడు. నైషధమారాధ్య సంప్రదాయకముగా రచించుచున్నానని శ్రీనాధుడీ పద్యమున—శైవాగమమును సూచించి ప్రారంభించినాడు.

ఈ సందర్భమున శ్రీనాథుడు, ఆరాధ్యశైవ సంప్రదాయము సిద్ధాంతీకరించు పాల్కురికి సోముని పండితారాధ్య చరిత్రను పద్య కావ్యముగా రచించిన వెనువెంటనే నైషధము రచించినాడన్న విషయము గుర్తునందుంచుకొనవలెను.

## (29)

"సతవచో నిరూఢుఁడు నిశాకరశేకర భక్తిభావనా సాత్యవతీయుఁడు.........మంత్రి మారనా మాత్యుఁడు".

"నిశా...ఁడు నిశాకరశేఖర=చంద్రుడు సిగడండగా గలవాడైన శివుని యందలి భక్తిభావనా=భక్తితోడి ధ్యానమునందు సాత్యవతేయుడు వ్యాసుఁడు" పుట (16).

శైవ వాఙ్మయమున=శివభక్తికి వ్యాసుని పేర్కొనరు. కాని శ్రీనాథుడు ప్రత్యేకముగా వ్యాసుని గూర్చిన యొక శైవసంప్రదాయము తెలుపుటకే మారన మంత్రికి విశేషణము చేర్చినాడు. ఆ కథ ఇది:

వ్యాసుడు విష్ణు కథలను ప్రపంచించి ఒకప్పుడు కేశవుని కంటే వేఱు దైవము లేదని, కాశీ క్షేత్రమున "నదైవం కేశవాత్పరమ్" అని చేయెత్తి చాటినాడు. వెంటనే నంది ఆ చేయుని స్తంభింపజేసినాడు. దానితో వ్యాసుని వాక్కేగాక భుజము స్తంభించినది. దీనికి 'వ్యాస భుజస్తంభన' అని పేరు. ఆతని చేయి తెగిపడినది. అప్పుడాతడు, శివుని మహిమ నెఱిగి వ్యాసాష్టకమున నాతని స్తుతించెను.

"కడఁగి కేశవు మీద గలఁడు లేఁడనుచు
వడి "నదైవం కేశవాత్పర"మ్మని, ప్ర
శస్తిగఁ జేయెత్తఁ జక్కఁగ నంది
"హస్తంభితొ భుజా"నాదన చేయి
తెగిపడ్డ క్రియనంచు దేవుని మహిమ
నెనసి వ్యాసుఁడు తన చేయి దెగిపడినఁ
గనుగొని వ్యాసాష్టకమున నుతించి
రతి న దైవం సంకరాత్పరమ్మనుచు
క్షితిఁ బ్రతిష్ఠించె మా శివు మహత్త్వంబు.

(పండితారాధ్య చరిత్ర. వాదప్రకరణము పుట 162.)

శ్రీనాథుడు కాశీఖండమున — వ్యాసేశ్వర మాహాత్మ్యము అనుపేర పై వ్యాస భుజాస్తంభ కథను వర్ణించి యున్నాడు. తన చేయి శివునివలన పొందినతరువాత కాశిలో "వ్యాసేశ్వర లింగము" ప్రతిష్ఠించినాడు. కాశీఖండము — సప్తమాశ్వాసము (102–112)లో పై కథ గలదు. "వ్యాస భుజస్తంభము" అని ప్రత్యేక పద్య కావ్యము గలదు.

## (37)

సీ. గగన కల్లోలినీ కల్లోల మాలికా
హర్మ్యసకములతో నవఘళించి
చరమ సంధ్యాకాల సంపుల్ల మల్లికా
స్తబక పంక్తులతోడ సరసమాడి
శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
విమలచంద్రికలతో వియ్యమంది
బిసరుహాసన వధూపృథు పయోధర భార
హార వల్లరులతో నవఁగి పెనఁగి

గీ. వెలయు నెవ్వని యభిరామ విమలకీర్తి
అతడు చెలువొందు రాయవేశ్యాభుజంగ
కదన గాండీవి జగనొబ్బగండ బిరుద
శాశ్వతుం డొప్ప సింగన సచివ వరుఁడు (1-39)

ఇది తిక్కన పద్యమున కనుకరణము.

సీ. కుంజర నికురంబ కుంభస్థలీసంగ
సిందూర రుచులతో చెలిమిచేసి
కేతన వ్రాత సంకీలిత మాణిక్య
రశ్ములగెడ విహారంబు సలిపి
సైనిక నికరవక్షస్థల పరి లిప్త
కాశ్మీర దీప్తులఁ గౌఁగలించి
దండనాదోత్కర చండబాహోద్యత
చక్షు ప్రభలు దారు సరసమాడి

గీ. యంశు జాలంబు లుభయ సైన్యంబులందు
బరగి బహు విధ శస్త్రాస్త్ర శరణ తతుల
బెరసి పరభాగ లక్ష్మి దీపింప మెఱయు
బాల్య రమణీయుడగు చిత్రభానుఁ డొప్పె.

(శల్య. 1-116)

దీని తరువాత షష్ఠ్యంత పద్యములైదు— శైవ పంచాక్షరి సూచించుచున్నవి. ఇంతవఱకు అవతారికయైనది. ఇంక గ్రంథ మధ్యమున రెండు, గ్రంథాంతమున నొకటిచూపి విద్వల్లోకమునకు దీనిని సమర్పించుచున్నాను.

## (38)

(2-42)

గీ. అమరుహాటకమయ కవాటములతోడ
గురుతరంబైన యప్పీటి కోట గవను
కులిశధారకుఁడప్పి తెక్కలుఁను దాను
బయట గొలువున్న పసిఁడి కొండయునుబోలె

ఈ పద్యమునకు వ్యాఖ్యానము ఒక పుట యున్నది(పుట99) కాని అది అనావశ్యకము—

మూలమున (2-86)

"పరణం కనకస్యమానినీం
దివమం కాదమరాత్రి రాగలాన్
ఘనరత్న కవాట పక్షిః
పరి రభ్యానునయ న్నువాసయావ్"

మూలమున కవాటములు — ర త్న మ య ము లు. కాని శ్రీనాథుడు హాటక మయములు— అనగా బంగారుమయములు అని వ్రాసినాడు. అప్పుడు తిరిగి అందే — పసిడికొండ — బంగారుకొండ అని యుండుటచే శ్రీనాథుని మూలముతో సరిలేదని చర్చించి— తను స్వంతపద్యము నిట్లు చేర్చినారు :

"ఘన మణి కవాటములు గ్రాలు గవనితోడ
హాటకమయంబయిన వీటి కోట దనరుఁ
గువిశధారకు దప్ప తెక్కలును దాను
బయట గొలువున్న మేరుపర్వతమువోలె"

కాని శాస్త్రులవారింత శ్రమపడవలసిన యగత్యము లేదు. శ్రీనాథుడు హాటక శబ్దమును, మూలము ననుసరించియే ప్రయోగించియున్నాడు.

మేరుపు పర్వతము రత్నసానువు — రత్నములు చరియల యందు గలది.

"మేరుస్సుమేరుర్హేమాద్రీ రత్నసానుస్సురాలయః" అని లమరము. (పుట 47)

మేరువునందు రత్నములుండును గావున ప్రత్యేకముగా రత్న కవాటములని శ్రీనాథుడు వర్ణింపలేదు.

ఇతస్తతోఽస్మిక విలసన్తిమే రోస్సమానవ ప్రేమణిసానురాగాః
(శిశుపాలవధ 4-2)

## (39)

(8-19)

"ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోకశాస్త్రంబులన్"

వ్యా. — 'పణినాపత్యోకశాస్త్రంబు' అను పదమునకు పణి మునియొక్క అపత్యమైన పాణినిచేత చెప్పఁబడిన వ్యాకరణశాస్త్రము అని యర్థము చెప్పవలసియున్నది. 'పణిన' శబ్దము పాణిని శబ్దము నకు ప్రకృతిగ్గానుపలబ్ధము కాలేదు.
ప్రతులలో పణినాం పత్యుక్త 'పణినా సత్యోక్త' అను వ్రాతలు కన బడుచున్నవి.

ఆ వెనుక కౌముదియందలి పణిన్‌శబ్ద గతసూత్ర వృత్తులను పేర్కొని రామభద్రయజ్వ పతంజలి చరితమున 'పణిన్' శబ్ద వ్యుత్పత్తిని పేర్కొని — అందువలన — పణినసూనుడు పాణినీ పణికి ముని మనుమడగును గాని కొడుకు కాజాలడు అని తెలిపినారు. పాణినీయ వ్యాకరణము ననుసరించి, పణిన సూనుడు పాణినికాదు. అందు వలన నిది అసాధువైనది. కాని శ్రీనాథుడు ప్రయోగించినాడు. అందువలన—

"అయినను మహాకవి ప్రయోగములు గాన ప్రామాదికములు గావను విశ్వాసముచేసి స్థితగతిచింతనగా ప్రక్రియ యూహ్యాము" అని కొన్ని ప్రయోగములిచ్చినారు. ఈ శబ్ద చర్చ యంతయు నీగ్రంథ మున— 659-660 పుటలలో నున్నది. ఈనాడింత చర్చ యనావశ్యకము.

"పణి నాం పత్యోక్తశాస్త్రంబు" అనునది సరియగుపాఠము. ముగ్ధ బోధ వ్యాకరణమున వ్యాఖ్యాతయగు శ్రీరామ తర్కవాగీశుడు "ఫలాదేరినః" ఫలిన ఇతి — పలంబర్హంపణి గర్భోమలం శృంగం కథ్యతె (తద్ధిత 447 సూ.) అని పణిన శబ్దము పఠించి యున్నాడు.

(ఫలమే—పలిన—బర్హమే—బర్హిణ—పణి - పణిన - గర్భం—గర్భిణ—మలన్ మలిన—శృంగమ్—శృంగిణ)

పై సూత్రముచే పణిన సూమశబ్దము పాణినిని తెలుపును.

పణినాంపతి - అలుక్సమాసము "తత్పురుషేకృతి బహులమ్". అను సూత్రమున—షష్ఠీ విభక్తికి లుగ భావము అపాంపతి వంటిది.

ధురావిజయమున గంగాంబ 'ఫణినాంపతి' ని వాడినది.

శ్లో॥ రజోభిర్మహు రుద్ధూత్తై
ర్నఘూబవతి భూభరే
కథం చిత్రుతనా భారం
చక్షమే పణినాంపతి–'' 436

పండితు లీ శబ్దమును గూర్చి యింకను విచారణ చేయుదురుగాక.

# 40

(8 201) కావ్యాంతము

## వెల్లెల్లి

వెల్లెల్లి పదము చిన్నదేకాని పది పుటలకు పైగా వ్యాఖ్యానింప దగినది. ఈ పదము నైషధమున చంద్రవర్ణనలో నున్నది ఆ పద్యము కావ్యమున చివరిది.

సీ॥ ముక్కంటి తలపువ్వు (1) మున్నీవేబట్టి (2)
కైటభారాతి డా కన్నుదమ్మి (3)
గగనలక్ష్మికి దంతకాండ తాటకంబు (4)
కలువవలవిందు (5) జక్కువల గొంగ (6)
వలరాజు వెల్లెల్లి (7) వనజ బాంధవునుద్ది (8)
శిశురాం శురత్నంబు (9) చేదుమందు (10)
కన్నులపండువు (11) గ్రహసార్వభౌముండు (12)
సురల యాకటిపంట (13) ఇరులదాయ (14

గీ. శివుహాలక్ష్మి పైదోడ (15) శేషభువన
సౌధకలధౌత కలశంబు (16) చందమామ
రాజవదన కల్యాణ పరంపరాభి
వృద్ధిగావించు గౌతమీ విశ్వమునకు– (8-201)

ఈ పద్యమునకు మూలములేదు. శ్రీనాథుడిందు చంద్రునికి 16 విశేషణములు వాడినాడు. ఇది యంతయు మనోరనుమే గాక సార్థకము. చంద్రుడు షోడశ కళాపూర్ణుడు. అతనికిగల కళలు 16.

ఈ విషయము సర్వంకషలోలేదు.

పై విశేషణములలో వలరాజు 'వెల్లెల్లి' అనునది ముఖ్యము. వెల్లెల్లి అనగా తెల్లగొడుగు–వెల్ల+ఎల్లి=వెల్లెల్లి [8] చంద్రుడు వలరాజు అనగా మన్మథునకు తెల్లగొడుగు వంటివాడని యర్థము.

1913లో వేదమువారు తమ సర్వంకషలో (పుట 748) వెల్లెల్లిని 'వెలల్లి'గా ముద్రించి "వెల్లల్లి=తెల్లకలువ (నెవ్వెలి అని. పూర్వముద్రణ పా. వెల్లల్లి (వ్రాతలలోని పా.)" అని వ్రాసినారు.

1920లో గిడుగువారు దీనిని తమ "ఆంధ్రపండిత భిష క్కుల భాషాభేషజము [9] అన్నవ్యాసమున నిట్లు విమర్శించినారు:

"వ్రాతప్రతులలో మేము చూచిన ఆరింటిలో" వలరాజు వెల్లెల్లి అనే పాఠమున్నది గనుకను, "ఆకాశవాపీ సితపుండరీకమ్" "వ్యోమసరస్సరోజమ్" మొదలగు వాటినిపట్టి చంద్రుణ్ని పద్మముతో పోల్చినా, కలువపువ్వుతో కవులు పోల్చినట్లు మేము చదువు కొన్న గ్రంథాలలో కనబడలేదు గనుకను శాస్త్రులవారి సవరణ సరియైనది కాదని నమ్ముతూ శృంగార నైషధములో వారుచేసిన సవరణలు చాలా మట్టుకు వ్రాతప్రతులలోని పాఠములకు విరుద్ధముగా ఉన్నవి."

1961లో వేంకటరాయశాస్త్రిగారి మనుమలు వేంకటరాయ శాస్త్రిగారు శృంగారనైషధము రెండవముద్రణమున ప్రకాశక విజ్ఞప్తిలో, తమ తాతగారి పాఠములను సమర్థించుచు– ఆక్షేపకులు– వ్యావహారికవాదము-అను శీర్షికలో పైపదమునుగూర్చి రామమూర్తి పంతులుగారిని ఆక్షేపించుచు (పుట 13) ఇట్లు వ్రాసినారు.

"తిక్కన నిర్వచనోత్తర రామాయణమున ఆ6. ప42 చంద్రోదయ వర్ణనమందీ పద్యమున్నది.

సీ. చిత్తజు చిగురునం జి తంబుగా నిడ్డ
లలితతమాల పల్లవ మనంగ
రతిపు మాణిక్య దర్పణమున నూనిన
కమనీయ మృగమద కణమనంగ
పెడవిల్తు లీలారవిందంబు మీఁదిరేఁ
దివుటమై నెరఁగిన తేఁటి యనఁగ
వలరాజు సిందూర తిలకంబులోఁ జెలు
వొందు కాలాగురు బిందువనఁగ

ఆవె. ఉదయరాగ మహిమ నుజ్జ్వలంబైన బిం
బరబు నడుమ లాంఛనంబు చెన్నుఁ
జేయపూర్వశైల శిఖర దేశంబున
నిందుఁడొప్పె భువన మెలమి మిగుల

శ్రీ పంతులవారీ పద్యమును గుర్తించి యుండినయెడల పై రీతిగా వ్రాసియుండరేమో. శ్రీనాథుని పద్యమునకు శ్రీహర్షుని మూలములేదు. ఇది అతని సొంతము. రెండుమూడు విధములు పాఠములు దొరికిన ఆయా ప్రకార మర్థము చెప్పకొనవలసినదేకాని శ్రీనాథుని పాఠము ఏదో ఎట్లుచెప్పగలము? శ్రీ పంతులవారు తెలుగు కవుల మదాహరణముల నొసగలేదు. తిక్కనది లలవిందము

శ్రీనాథునిది వెల్లల్లి, ఇదే శ్రీనాథుని పాఠముగా నుండరాదా.'' (14 పుట)

గిడుగువారిని విమర్శించుటకు తడవు దొరికినదని వేవేగారు పై పద్యము నుదాహరించరేగాని—వెల్లల్లికి—అరవిందమునకు నణు మాత్రమైన సంబంధము లేదని గ్రహింపలేదు — ''రెండును చంద్ర వర్ణనలేగదా: అచట వెడవిల్తుని అరవిందమున్నది, ఇచట వలరాజా వెల్లల్లి యున్నది''—అనుకొని విమర్శన సాగించిరి — తిక్కన పద్యము వేవేగారి కర్థము కాలేదేమో. అది చంద్రవర్ణనయేగాని—ఆ పద్యమున నున్నవి చంద్రునకు—విశేషణములుకావు—చంద్రునిలోని 'లాంఛనము' (మచ్చ) నకు విశేషణములు.

ఆ మచ్చ యెట్లున్నదనగా

1. మన్మథుని చిగురుటమ్మునకు తమాలపలకము చీకటి చెట్టు చిగురు తగిలించినట్లున్నది.
2. అతని అద్దమునందు పడిన కస్తూరి కణమునవలెనున్నది.
3. అతడు చేతిలో లీలగా బట్టుకొను అరవిందమున — తుమ్మెద వలె నున్నది.
4. అతని సింధూర తిలకంబులో అగరు బిందువువలెనున్నది.

ఎత్తుగీతిలో తిక్కన — ''లాంఛనంబు మెఱయ'' అని తెలిపి, పై నాలుగు పాదములోని — తమాలపల్లవము — మృగమదకణము— తుమ్మెద-అగరు బిందువును విశేషణములుగాచేసినాడు[10] కావున— లీలారవిందము అనునది తుమ్మెదకు సంబంధించినదిగాని వెడవిల్తునకు సంబంధించినదికాదు — ఇట్లే తక్కినవాని నన్నింటిని అన్వయించు కొనవలెను —

శ్రీనాథుని చంద్రవర్ణనలోని విశేషణములన్నియు-చంద్రునికి సంబంధించినవి—తిక్కన చంద్రవర్ణనలోని విశేషణములన్నియు చంద్రుని లోని మచ్చకు సంబంధించినవి తిక్కన శ్రీనాథుని పద్యములలోని భావము సమానమనుట బట్టతలకు మోకాలికి ముడిపెట్టుట వంటిది —

''గిడుగువారు తెలుగు కవుల నుదాహరణముల నొసగలేదు'' అని మఱియొక ఆక్షేపణ—ఇదిగో వెల్లెల్లికి ప్రయోగము—

ద్వి. పట్టుకుచ్చులు పట్టు వస్త్రముల్ చిట్టి
చిట్టి వెల్లెల్లులు సితచామరములు —

(పండి. పర్వ. పుట 313)

శ్రీనాథు డీనాటివారికన్న పండితారాధ్య చరితమును చక్కగా చదివి జీర్ణించుకొన్నాడు. పై పదమందలదే —

లసలు వేదము వారు మూర్చి ముద్రించిన పాఠమే అపపాఠము అర్థము లేనిది.

వెల్ల + అల్లి = వెల్లల్లి = తెల్ల కలువ—అని వారి యర్థము.

కాని — అల్లి శబ్దమునకే తెల్లకలువ యని యర్థము. స్వా. ని — పుట 313. అల్లి—తెల్లికాలువ.

ద్వి. ''ఒక తెల్ల కలువలోనున్న పూబోడి
సుకుమారియగు వేల్పుచూలి నీక్షించి
అల్లిలో నుదయించెనని యెన్ని కుముద
వల్లి నామంబడి నారని ప్రేమ''

(తాళ్ళపాక చిన్నన్న ద్వి. పరమ 6–452 పుట.)

'అల్లి'యన్న తెల్లకలువ అర్థమైనప్పుడు 'వెల్లలి' తెలని తెల్ల కలువ—శ్రీనాథమహాకవి యిట్టి పునరుక్త పదమును వాడునా? ఈ పాఠము పూర్తిగా పరిహరింపదగినది.

వెల్లెల్లి
పాఠవిశిష్టత
శైవసంప్రదాయము.

శ్రీనాథుడు వలరాజునకు చంద్రుడు వెల్లెలి గా వర్ణించినాడు గాని, చంద్రుని శిరోభూషణముగా ధరించిన శివునకు గొడుగు వెల్లల్లియే — వెల్లల్లియనగా తెల్లగొడుగు.

దానికే శ్వేతాతపత్రము-శ్వేతచ్ఛత్రము — అని, సంస్కృత నామములు.

శివునికి శ్వేతాతపత్రము : విష్ణువునకు పీతాతపత్రము.

''చాటు శ్వేతచ్ఛత్ర శర్వస్య'' యనుచు
''చాటుపీతచ్ఛత్రశార్ఙిణీ'' యనుచు
శ్వేతాతపత్రంతు విశ్వేశ్వరాయ
పీతాత పత్రంతువిష్ణవే యనుచు

(పండితారాధ్య చరిత్ర. వాద. ప్ర. పుట 160)

ఇది శృంగారనైషధము చివరనున్నది. అనగా ఈకావ్యము శైవ సంప్రదాయకనుగా, సమాప్తమగుచున్నది. ఈ సందర్భమున శ్రీనాథుడు హర్షనైషధముకు నాంధ్ర నైషధమునకు నాద్యంతములకు చేసిన, సంధానము లోకోత్తరమై యున్నది.

హర్షనైషధమున చంద్రవర్ణనలో శ్రీనాథుని పద్యమునకు మూలములేదని యీ వఱకు తెలుపబడినది. కాని శ్రీహర్షుని మూల

మున ప్రారంభముననే నలుని కీర్తిని శ్వేతచ్ఛత్రముతో పోల్చబడినది.

"నలః సితచ్ఛత్రిత కీర్తిమండలః
సరాసరాసీన్మహసాం మహోజ్జ్వలం 1 శ్లో
సువర్ణదండైక సితాతపత్ర
జ్వలత్ ప్రతాపావళి కీర్తిమండలః 2 శ్లో

శ్రీనాథుడు కథాప్రారంభమున పై మూలమునననుసరించి
"సీ. తపనీయదండైక ధవళాత పత్రితో
ర్గండ తేజః కీర్తిమండలుండు" (1-46)
అని ధవళాతపత్రముతో ప్రారంభించినాడు.

కథాప్రారంభము ధవళాతపత్రము (శ్వేతచ్ఛత్రము) కావున కావ్యాంతము-శ్వేతచ్ఛత్రముతో ముగియవలెను. అందునకే మూలమున నంతమందులేని ధవళచ్ఛత్రమును, (వెల్లెల్లి)ని తెలుగు కావ్యాంత మున శ్రీనాథుడు శైవసంప్రదాయాను సారముగా సముచితముగ తెనుగున సంఘటించి రెండింటికి నైక్యత సమకూర్చినాడు. శ్రీనాథుని కీపదమునందు మక్కువ యెక్కువ. శ్వేతచ్ఛత్రమున కాతడు పర్యాయ పదములను గూర్చి వాడుట హృద్యము.

"వలరాజు ధవళోష్ణ వారణంబు" (వల్లభాభ్యుదయము)
"అసమ శరసార్వభౌమముత్యాల గొడుగు (భీమ 3-43)
"అతను జగజెంపు గొడుగెవ్వడవ్విధుండు. (కాశీ 4-195)
(జగజంపు గొడుగనగా ముత్యాలగొడుగు) శ్వేతచ్ఛత్రము రాజలాంఛనము-శివుడు రాజకిరీటుడు. అట్టి శివునకు శ్రీనాథుడు పట్టినది.

శృంగారనైషధకావ్యశ్వేతచ్ఛత్రము.

---

తెలుగున 'వెల్లెల్లి' వంటిదే వెల్లగొడుగు-అనుపథము-ఇదియే.
వెల్లగొడుగు
వెల్గొడుగు
వెల్గోడు
వెల్గోటిగా రూపాంతరముల నందినది.

వెల్గోటి వారనునది రాచకొండ వెలమవారి యింటిపేరు. వారి పూర్వులు రాజులకు గొడుగు పట్టెడివారు.

---

# అధోజ్ఞాపికలు

1 సర్వంకష వ్యాఖ్యకు సమకాలీనముగా నైషధమునకు మటి యొక వ్యాఖ్య వెలువడినది. మదరాసు ఆనంద ముద్రణాలయము వారు దానిని ముద్రించిరి. ఇందు కొన్ని మంచిపాఠములు గలవు. వ్యాఖ్యాతలు కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రిగారు. ఇది ప్రచారములోనికిరాలేదు.

2 సాహిత్య సమీక్ష శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. 1955. శృంగారనైషధము పాఠభేదములు. ప్రస్తుతవ్యాసకర్త (భారతి నవంబరు 1963)

శృంగారనైషధము సువరిష్కృత ము దణము. ప్రస్తుతవ్యాస కర్త (ఫిబ్రవరి 1964)

3 ఉత్తర హరివంశము. వేటూరి వారి పీఠిక. వావిళ్ల-1951.

4 తెనుగున పింగళిసూరన కవిరాజుకృతి ననుసరించి రాఘవ పాండవీయమును వ్రాసెను-సంస్కృతాంధ్రకృతులను పరిశీలించిన సూరన సంస్కృతరాఘవపాండవీయము నెట్లను సరించినదియు తెలియగలదు.

5 ఇదే పేరుతో డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తిగారొక ప్రత్యేక గ్రంథము రచించినారు - అది ఆగమ ప్రమాణ ములచేత-శ్రీనాథుని శైవత్వమును ప్రపంచించు విశిష్ట కృతి.

6 ఎఱ్ఱనయు "బ్రహ్మాండ పురాణంబున తీర్థభాగ శ్రవణము" అని ఈ పురాణము నుదాహరించినాడు. (నృసి 1-4)

7 కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుగారు శ్రీపతి పండితుని వంశీయులు. వారి గోత్రమాత్రేయ గోత్రము. కాశీనాథుని వారి సంపూర్ణ వంశవృక్షము-బసవపురాణము తొలి ముద్ర ణము-1926 లో గలదు.

7A (శ్రీ పోలుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మధురా విజయము పీఠిక-124 పుట)

ఈ గ్రంథము విద్యాంసులందఱును అధ్యయనము చేయదగినది.

8 ఎల్లియనగ దేవునకు
ఎల్లియనగ గొడుగునకును నెసగును పేరులే-
(ఆంధ్రనామ సంగ్రహము)

9 ఇది 1933 లో, 1966 లో పునర్ముద్రితమైనది.

10 ఈ పద్యము తిక్కన కవితా శిల్పమున కొక మచ్చుతునక. ఇందు ఉపమాను ప్రాణిత ఉత్ప్రేక్షాలంకారమున్నది. వస్తు కవితాచ్ఛాయ యున్నది. దీనినిగూర్చి అకాడమీవారి నిర్వచ నోత్తరరామాయణ పీఠిక - వర్ణన శిల్పములో (పుట 1X. లేదు.

# క ల గూ ర గం ప

## అండీ! పుంటికూర! కొండెంగ!

మనం ప్రతిదినమూ వాడే కొన్ని మాటల పుట్టుపూర్వాలు ఆకస్మాత్తుగా మనకు స్ఫురించినప్పుడు కలిగే ఆనందం అపూర్వంగా ఉంటుంది "ఏకమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః!" అని పూర్వులన్నారుగాని, "ఏక శబ్ద వ్యుత్పత్త్యవగాహనం పుత్రోత్సవం మన్యంతే ఆధునాతన శాబ్దికాః" అంటాను నేను.

### "ఏమండీ ?"

ఎవరన్నా మనకు బహుకాలానికి కనిపిస్తే "ఏమండీ, క్షేమమేనా?" అని పలుకరిస్తాము. అంగడికో, సంతకో వెళ్లినప్పుడు "ఏమండీ, దీనిని ఎంతకిస్తారు? దీని ధర ఎంతండీ" అని ప్రశ్నిస్తాము. ఎక్కువ ధర చెప్పినప్పుడు "ఇంత ఇవ్వలేమండీ, కొంచెం తగ్గించుకోండి!" అని కోరుతాము. ఎవరైనా మన ప్రశ్నకు సరిగ్గా సమాధానం చెప్పనప్పుడు "చెప్పిండి మరి" అని నిగ్గదీస్తాము. 'పోండి! మీరెప్పుడూ ఇంతే!" అంటూ ప్రియురాలు ప్రియునిపై అలుగుతుంది. "ఏమండోయ్!" అని సంబోధిస్తుంది భార్యభర్తను.

ఈ 'అండీ' పదం ఏమిటో? ఎప్పుడు వచ్చి వ్యవహారంలో చేరిందో? శబ్దరత్నాకరకారుడు ఈ "అండి" పదానికి రోహపాత్ర విశేషమని అర్థం చెప్పాడుగాని, సంబోధనార్థకంగా చెప్పలేదు. సంబోధన వాచక ప్రత్యయాలు మనకు ఓ, ఓరి, ఓసి, ఆ, ఆరా, ఊ కనిపిస్తున్నాయి. గ్రంథాలలో ఓ రామా ఓరి వెధవా? ఓసి లక్ష్మీ, రామా, రాములారా, ఉదాహరణలు. అతిప్రాచీన వైయాకరణుడైన కేతన సంబోధన విభక్తి ప్రత్యయాలు ల, అర, అని చెప్పారు. ఓ అనే ప్రత్యయం విడిగా చెప్పకపోయినా 'ఓపురుషోత్తమ' అనె ఉదాహరణ మిచ్చాడు. ఉకారాంత పదాలు సంబోదనలో దీర్ఘాలవుతాయన్నాడు. సంబోదన వాచకంగా 'అండి' పదంగాని ప్రత్యయంగాని చెప్పలేదు. కావ్యాలంకార చూడామణి కారుడు గాని, చందోదర్పణ కారుడుగాని ఈ 'అండీ'ని చెప్పలేదు. ఆంధ్రశబ్ద చింతామణి కారుడు గూడ 'అండీ' చెప్పలేదు.

మరి ఈ అండీ పదం సడమంత్రంగా వచ్చి, నేడు ఎలా పాకిపోయిందో! ఇప్పుడూ, అప్పుడూ ఎవరినైనా సంబోధించ వలసి వస్తే, "అయ్యా, దొరగారూ, పండితులూ, రామయ్యా, కామయ్యా, లక్ష్మీ, గౌరీ, గంగులూ, అని పిలవడం ఉంది కాని, ఈ "అండీ? బాబుగారండీ, దొరగారండీ! ఔనండీ, మరేమండీ, అంతేనండీ, అలాగాండీ, ఎంతండీ" అని ప్రతిమాటకూ మర్యాదార్థంలో ఎలా హత్తుకుపోయిందో! అండీ అని అనకపోతే అవమానంగాను భావించడం చూస్తే నవ్వు వస్తుంది. నిజమే! వెనక వచ్చిన కొమ్ములు ఎప్పుడూ వాడేగదా! ఈ అండీ ఎలా వచ్చిందో చూడడానికి ముందు తెలుగు లోబుట్టువులలో సంబోధన వాచకాలు చూడడం అవసరమే. కాని, వాటి పూర్వ చరిత్రకు పోక ఇప్పటి వ్యవహారంలోని సంబోధనం చూద్దాం.

కన్నడ తమిళాలను ఇలాటి పరిస్థితే ఏర్పడింది. "ఎన్నాంగో, ఆమాంగో, ఆదుదాంగ. పొంగోయ్యా, ఇల్లేంగో" ఇవి నేడు తమిళుల గౌరవపూర్వకమైన సంబోధనార్థకాలు, కన్నడంలో 'రీ, ఏస్రి, హౌ దీ.నో.డీ, ఇల్రీ, ఆయిత్రేనీ' అని మర్యాదగా సంబోధించడానికి రీ వాడుతున్నారు.

అండీ, అంగో, అంగ, రీ, ఈ మూడు భాషల గౌరవ సంబోధన ప్రత్యయాలకు సూత్రం ఒక్కటేనని తోస్తుంది.

కేతనకాలపు వ్యవహారం సంగతి మనకు తెలియదుగాని శబ్దరత్నాకరకారుడు మొన్నటి వాడుగదా! ఆయన కాలంలో ఈ అండీ ప్రయోగం ఉండనే ఉంది గదా! నిత్యవ్యవహారంలో ఉన్న ఈ విచిత్ర ప్రయోగాన్ని శబ్ద రత్నాకరకారుడు గ్రహింపవలసింది. ఎందుచేత ఉపేక్షించాడో! వ్యవహారంలో ఉన్న అన్యదేశ్యాలను గ్రహించిన వాడు దీనిపై ఎందుకు సీతకన్ను వేశాడో!

ఈ అండీ ప్రత్యయం మూలమేమిటని వెదుకుతూ 'పోగా ఇది క్రియా రూపాలలో మనకు అర్థాంతరంలో సాక్షాత్కరిస్తుంది, లోట్ మధ్యమ పురుష బహువచన రూపంలో. చేయుడు, చేయుండు; తినుడు, తినుండు; పడుడు, పడుండు! కొనుడు; కొనుండు, వినుడు, వినుండు ఇత్యాదిగా. ఇది మర్యాదా సంబోధనార్థకమైన అండికి మూలమైన ఉంటుందని తోస్తుంది. ఈ ప్రత్యయం క్రమంగా సంబోధనలో రూఢ మయివుంటుంది.

తిను ధాతువును తీసుకుందాం. నీవు తినుము- లోట్ మధ్యమ పురుష ఏకవచనం. మీరు తినుడు, మీరు తినుండు- లోట్ మధ్యమ పురుష బహువచనం. ఇలాగే చేయుడు, చేయుండు, పొమ్ము, పొండు రమ్ము, రండు. ఇలా లోట్ మధ్యమ పురుష బహువచన ప్రత్యయమైన డు, ండు ఎదుటి వారిని మర్యాదగా కోరడం గనుక బహువచన ప్రత్యయాలన్నీ మర్యాదను తెలిపేవి గనుక, సంబోధనలోను గౌర

వార్థాలుగా రూఢమయిపోయాయి. ఈ డు, ండు ఆభ్యర్థనార్థంలో ఈతోకలిసి చేయుఁడీ, చేయుండీ, వ్రాయుఁడీ, వ్రాయుండీ, పొందు, పొండీ, పొండీ ఇత్యాదిగా వ్యవహారంలోకి వచ్చాయి. లోట్ మధ్యమ పురుష బహువచనంలోని డు, ండు, ండీ లు క్రమంగా లోట్ మధ్యమ పురుష ప్రయోగంనుంచి విడిపోయి సాధారణ సంబోధన వాచకాలుగా మర్యాదకోసం వాడుకలోకి వచ్చాయి—ఏమండీ, ఎందుకండీ, చాలండీ, నిలవండీ, నిజమండీ, కాదండీ ఇత్యాదిగా. కారణమేమిటో స్పష్టంగా చెప్పలేముగాని, ఎదుటి వానిని అభ్యర్థించడం సంబోధనలోను కొంత ఉన్నది గనుక, అభ్యర్థనం కారణం కావచ్చు.

ఉత్తరాంధ్ర (తెలంగాణా) జానపద వ్యవహారంలోను, పశ్చిమాంధ్ర (రాయలసీమ) జానపద వ్యవహారంలోను, తమిళనాడులో స్థిరపడిన తెలుగువారి వ్యవహారంలోను మధ్యమపురుష లోట్ బహువచనరూపం నేటికీ—పదుండ్రి, చేయుండ్రి, తాగుండి, తినుండి, పట్టుండి, పట్టుండ్రి. కూర్చుండుండి ఇత్యాదులు వింటున్నప్పుడు శ్రవణపేయంగా ఉండడమేకాక, ప్రాచీన రూపాలను తలపిస్తాయి. జానపద మహిళలు మాట్లాడుతున్నప్పుడు ఈ వ్యవహారం మరీ ముచ్చటగా ఉంటుంది. ఏకవచనంలో చేయుము + ఈ—చేయుమీ—చేయిమీ. రమ్ము + ఈ—రమ్మీ—రామీ, పొమ్ము + ఈ-పొమ్మీ-పోమీ. చూడుము + ఈ చూడుమీ, చూడ్మీ, చెయ్మీ.

కన్నడ, తమిళ రీ, అంగలకు కూడా లోట్ మధ్యమపురుష బహువచనమే మూలమని తోస్తుంది. కన్నడంలో లోట్ మధ్యమ పురుష ఏకవచన బహువచనాలు—మాడు, మాడిరి, కూడు, కూడిరి, ఓడు, ఓడిరి. తమిళంలో సాప్పిడు, సాప్పిడుంగళ్. పో, పోంగళ్, అమర్, అమరుంగళ్ మొదలైనవి. ఈరీ, గళ్, ంగళ్ ప్రత్యయాలు విడిపోయి ఏన్రీ, హౌద్రీ, కూడ్రీ, ఇద్రీ అని మర్యాదా పూర్వక సంబోధనార్థాలుగా కన్నడంలోను, ఎన్నాంగ, చొన్నాంగ, ఆమాంగ, పోంగోన్నా, ఎంగేగో—అని తమిళంలోను వాడుకలోకి వచ్చి ఉంటాయి.

## పుంటి కూర

గోంగూర, గోగుకూరలకు పర్యాయంగా జంట నగరాలలోను, ఉత్తరాంధ్రంలోను పుంటికూర అనే పదం మనకు ప్రతిదినం చెవిన బడుతూ ఉంటుంది. "పుంటికూర, పులిచింతకూర, గంగవావిలి కూరమ్మో! అంటూ కూరలమ్మేవాళ్ళ కేకలు వాడవాడ మారుమోగుతుంటాయి. ఈ పుంటికూరకు అర్థం మనకు తెలుసు-గోంగూర అని. దీని వ్యుత్పత్తి ఏమిటి? పుల్లటికూర—పుంటికూర అన్నారు. డాక్టరు పి.యశోదారెడ్డిగారు. దీని వ్యుత్పత్తి చూద్దాం.

ఈ గోంగూరను కన్నడులూ, తమిళులూ కూడ విశేషంగా వాడుతారు. గోంగూరపచ్చడి మన ప్రజాసామాన్యానికి ఎంత ప్రధానమైన వ్యంజనమో, తమిళనాడులో గోంగూర పులుసు ప్రజాసామాన్యం ప్రధాన వ్యంజనం. పప్పు ఏమిలేకుండా వట్టి గోంగూర పులుసు, అన్నం ప్రధాన భోజనం సామాన్యులకు కార్మిక సామాన్యం తిండీ ఇదే. కన్నడనాడులోను గోంగూరను పచ్చడిగానో, పులుసుగానో, పప్పులో వేసి పుల్లగూరగానో వండుతారు.

పుంటికూర అనే వ్యవహారం ఉత్తరాంధ్రంలో ఇంత బహుళంగా ఉన్నందుకు కారణాలు వెదికేముందు తమిళ కన్నడాలలో దీని సమానార్థక పదాలు, వాటి అర్థాలు చూద్దాం. తమిళంలో దీనిని పుళిచ్చకీరై అంటారు. అంటే పుల్లని కూర. దీని సహజ గుణం పులుపు గనుక, చింతపండువంటి మరొక పుల్లని పదార్థం కలయిక లేకనే వ్యంజనం అవుతుంది గనుక తమిళ కార్మికులకు ఇది చాల ఇష్టం; సులభంగా సంపాదించదగిందీని. మనకిది ఎంత ఆంధ్రమాతో తమిళులకూ, కన్నడిగులకూ అంతే మాత. కాని, తమిళ కన్నడ ప్రాంతాలలోని నాగరకులైన పైతరగతివారు దీనిని వాడరు; సామాన్య ప్రజలే వాడుతారు. కనుక పైతరగతివారిలో ఇది అంత మన్నన పొందలేదు.

కన్నడంలో దీని సమానార్థకం పుండి, పుండియపల్లె, పుండే పల్లె, పుండేపల్య. దీని అర్థంకూడ పుల్లటి వస్తువు అనే అయివుంటుంది; దీని రుచినిబట్టి. పుళి, పుళ్, పుణిసి, పుణిసె, హుళి, హుణిసె పదాలు కన్నడంలో ఆమ్లవాచకాలు. దీని ఉచ్చారణలోను, అర్థంలోను దగ్గరగా ఉన్న పుండి అనే పదం మొదట్లో పుల్లటి పదార్థం అనే అర్థంలోనే వ్యవహృతమై క్రమంగా గోంగూరకు రూఢమయి వుంటుంది. ణకారం, 'ండ' కారం పరస్పరం మార్పు చెందడం తెలుగుతోబుట్టువు లన్నిటిలోను ఉన్నదే. పండు-పణ్ణు, హణ్ణు; పుండు—పుణ్ణు, హుణ్ణు; ఇలాగే పుళ్, పుళి—పుణ్—పుండి అయివుంటుంది.

తెలుగు తోబుట్టువులలో ఇది పుళి—చ్చకీరై. పుండి లని వ్యవహారంలో ఉండడాన్నిబట్టి, రుచిలోను, ఉచ్చారణలోను ఇది పుళికి దగ్గరగా పుండడాన్నిబట్టి, కన్నడంలోను, తెలుగులోను పుండి అని వ్యవహారం పొందివుంటుంది. క్రమంగా తెలుగులో ఈ పదం ఏ కారణంవల్లనో వ్యవహారచ్యుతమైంది; పశ్చిమ, పూర్వాంధ్రాలలో; ఒక్క ఉత్తరాంధ్రంలో మాత్రమే పుంటికూర అనే వ్యవహారం మిగిలింది. అదివరకే మన దేశంలోవున్న నార గోంగూరను పోలిన మరి కొన్ని పుంటికూరలు-దనాసరి గోంగూర వంటివి తనాసీర్ మొద

లయిన సుదూర పూర్వప్రాంతాలనుంచి మనదేశానికి, సుగంధ ద్రవ్యాలతోపాటు వచ్చాయి. రెడ్డిరాజుల కాలంలోనో, అంతకుముందో. ఆగ్నేయాసియా దేశాలతో తెలుగువారికి రెండువేల యేండ్ల క్రిందటి నుంచే సంబంధం ఉందిగనుక, ఈ దనాసరి (తరుణాసీర – తనాసిర్) గోంగూర ఆ ప్రాంతంనుంచే వచ్చిఉంటుంది. ఇది మన దేశంలోని గోంగూరను పోలిందిగనుక, ఆ గోంగూర పదంతోనే — దనాసరి గోంగూర ఇత్యాదిగా — వ్యవహృతమయింది. పుండి, పుంటి అనే పదాలు వ్యవహార చ్యుత మయి వుంటాయి, ఆ ప్రాంతాలలో కనుక; కన్నడంలో పుండియపల్లె, పుండేపల్లె అని, తమిళంలో పుళిచ్చకీరై అని పూర్వరూప స్ఫోరకాలైన పదాలు ఉండడాన్నిబట్టి, ఉత్తరాంధ్రంలో నేడు వ్యవహారంలో మిగిలిన పుంటికూర అనే పదం అతి ప్రాచీనమయిందని నిర్ణయించవచ్చు.

గోంగూర అనే పదానికి మరొక పర్యాయ పదం పుంటికూర దొరికినందుకు మనం ఎంతో సంతోషించాలి కాని తమ తమ ప్రాంత వ్యవహారమే నిర్దుష్టమని విర్రవీగుతూ తదితర ప్రాంతాల వ్యవహారం దోషజుష్టమని దూషించడం సభ్యతగాదు.

## కొండెంగ

ఆమధ్య మిత్రులు శ్రీ కొరిడె రఘుపతిరావుగారి స్వగ్రామం మంగంపేటకు వెళ్ళాను. మంగంపేట మెదక్ జిల్లాలోని హైదరాబాదుకు ముప్పయి మైళ్ళ దూరంలో ఉంది. అందరం ఏదో మాట్లాడుకుంటున్నాము. పిల్లలు గోలపెట్టారు "కొండెంగలు! కొండెంగలు!" అని. పెద్దలంతా వినోదం చూడడానికి పరుగెత్తారు; నేనూ వెళ్ళాను.

చెట్లమీద కొండముచ్చులు ఎగురుతున్నాయి. పిల్లలు "కొండెంగలు! కొండెంగలు!" అంటూ వాటి వెంటపడ్డారు. కొండెంగ అంటే కొండముచ్చా!— అనుకున్నాను. కొండెంగలు అనే మాట ఏమిటి? మరి కొండముచ్చు అనేమాట మాత్ర మేమిటి?

నా ఆలోచనలు కొండెంగ, కొండముచ్చులమధ్య పడి, కొట్టుకొంటూ, ఒక ఒడ్డుకు చేరాయి. మనం సాధారణంగా ఎఱ్ఱ మూతి కోతిని కోతి అంటున్నాము. నల్లమూతి కోతిని కొండముచ్చు అంటున్నాము. ఈ కొండముచ్చు వ్యవహారం (11) పూర్వ, పశ్చిమాంధ్రాలలో ఉన్నది. ఇది ముచ్చువలె- దొంగవలె— ముఖం తప్పిస్తూ విచిత్రంగా వ్యవహరిస్తుంది గనుక, దీనిని కొండముచ్చు అన్నారని పిస్తుంది. కాని కొండముచ్చులోని కొండ పదానికి అర్థం స్పష్టంగా తెలియదు. ముచ్చులాగ కొండల్లో ఉండేదనా, దీనికి అర్థం?

కొండెంగకు శబ్దరత్నాకరం ఏమిఅర్థం చెబుతుందో తిరగవేస్తే, కొండెంగ-వై. వి. కొండయందుండెడు నల్లకోతి. ద్వి॥ బడుగు;కొండెంగ వీనివెక్కురు తలఁ దఱుఁగ–హరిశ్చ. 2ఆ అని ఉన్నది. కొండెంగకు నల్లకోతి అని అర్థమిచ్చి, కొండయందుండెడి నల్లకోతి అన్నది! కొండెంగకు కొండ + ఎంగ అని విడదీసినట్టు స్పష్టపడుతుంది. అయితే ఎంగ అనే పదానికి కోతి అనే అర్థం శబ్దరత్నాకరంలోను, మరెక్కడనూ కనిపించదు. ఎఱ్ఱమూతికోతికూడ కొండల్లో ఉండేదే గదా! దానిలోను అతివ్యాప్తం కావచ్చుగదా! కనుక కొండెంగ వ్యుత్పత్తి శబ్దరత్నాకరం చెప్పింది కాక మరొకటయి వుంటుంది!

కోతికి మరొక రూపం క్రోతి. ఈ రెండురూపాలలోను మధ్యన అరసున్నఉంది దీన్ని పూర్వం క్రోఁతి, కోఁతి అని పలికేవారు. ఇప్పుడు తమిళనాడులో స్థిరపడిన తెలుగువారు కోంతి అనే వ్యవహరిస్తారు వాణిమూంతిచూడుమీ కోంతిమూంతి అంటారు, వికారంగాఉన్న వ్యక్తిని చూచి.

ఈ కోతి కోతులకు తెలుగుతోబుట్టువులయిన తమిళకన్నడాలలో సమానార్థకాలు చూద్దాం. తమిళంలో కొరంగు, కురంగు. కన్నడంలో కోతి, మంగ, కురంగు—కొరంగె కొరంగి,—క్రొంగి, — క్రొంతి క్రోంతి- కోతి అయిందని భాషాతత్త్వవేత్తలంటున్నారు.

కొండెంగకు కూడ కొరంగే మూలరూప మని తోస్తుంది నామట్టుకు నాకు, కొండెంగను—నల్లమూతి కోతిని కడపజిల్లాలో గండంగి అంటారని సుప్రసిద్ధ కవి మిత్రుడు శ్రీ గజ్జెల మల్లారెడ్డి నాతో అన్నారు. ఈ గండంగి, కన్నడంలోని మంగపదమూ ధ్వనిసామ్యంతో కొండెంగకు దగ్గరివి. మంగపదాన్ని కన్నడులు నల్లమూతి కోతికే వ్యవహరిస్తారు. పరిశీలించిచూడగా, కురంగుపదం మరొకవిధమైన ఉచ్చారణలో, కురంగు—కొరంగ- కొడంగ-కొండంగ— కొండెంగ అని మారివుంటుంది. ఈ పరిణామం సహజం కూడ. రకారం డకారం కావడంలో అసహజత ఏమీలేదు. మొదట కురంగు పదం వానర సామాన్యవాచక మయి, దానినుంచి రెండు విధాలుగా బయలుదేరిన క్రోతి, కొండెంగ పదాలు వానర విశేషవాచకాలు — ఒకటి ఎఱ్ఱమూతి కోతికి, మరొకటి కొండముచ్చుకు — అయాయి. కొండెంగ ముచ్చువలె-దొంగవలె ప్రవర్తించడంవల్ల కొండెంగ ముచ్చు అని వ్యవహారంలో ఉంది, జనంనోళ్ళలో నలిగి కొండముచ్చు అని పూర్వాంధ్రప్రాంతంతో వాడుకై, పాతరూపమైన కొండెంగ ఉత్తరాంధ్రంలోను, కొండెంగ రూపాంతరమైనగండంగి పశ్చిమాంధ్రలో కొన్ని ప్రాంతాలలోను నిలిచాయని తోస్తుంది. కొండముచ్చుకు కొణంగి అనే వ్యవహారమూ ఉంది. కోతిలాగ ప్రవర్తించేవారిని మనం 'కొంటె కోణంగి' అంటాము. "ఏమిటా కోణంగి చేష్టలు?" అని బెది

రిస్తాము, అల్లరిచేసేవారిని. ఈ కోనంగి — కోనంగి పదం కూడ కురంగునుంచి పుట్టినదే. ఉకారం ణకార నకారాలుగా మారుతుంది. కనుక, కురంగు–కొరంగు–కొడంగు–కొణంగి - కోణంగి – కోనంగి అని క్రమంగా పరిణమించి వుంటుంది. వింత ఏమిటంటే, కురంగు అనే ఒకేమాటనుంచి పరిణమించిన క్రోతి–కోతి, కొండెంగ–గండ్రంగి, కోణంగి–కోనంగి పదాలు మూడుపాయలుగా భిన్నార్థచ్ఛాయలలో రూఢంకావడం; ప్రత్యేక పదా లనే భ్రాంతి కలిగించడమూను.

సహృదయ భాషాతత్త్వ విచారకులు పై మూడు పదాల మూలగవేషణకు నేను సరికొత్తగా ప్రతిపాదించిన వాదాన్ని పరిశీలిస్తారని ఆశిస్తున్నాను.

— శ్రీ తిరుమల రామచంద్ర.

# కోరుకొండప్రాంత-పాలకుడైన అన్నలదేవు డెవరు

"ఆంధ్రసర్వస్వము" (పుట 507 509)లో వోళసా మాజ్యముక్షీణించుట మొదలుపెట్టగనే రాజమహేంద్రవరముతాలూకాలోని కోరుకొండవద్ద రెడ్డిరాజులు తమ ప్రభుత్వమును నెలకొల్పుకొనిరి. వీరిలో అన్నలరెడ్డి ప్రభుత్వము 1300 సం. వరకు కొనసాగినది. 1263లో కోరుకొండలో అన్నలరెడ్డి కోటకట్టించెను. 1320–23లో కాకతివంశ ప్రతాపరుద్రుడు తెలుగు దేశములో చాల భాగము జయించి తన యధికారమును రాజమహేంద్రవర ప్రదేశమందును వ్యాపింప జేసికొనెను. ఈ కోరుకొండ కూడ ప్రతాపరుద్రుని అధికారిమం దుండెను." అని చెప్పబడినది.

లోకల్ రికార్డ్సు వాల్యూమ్ 19–పుట 63–ఆధారముగా రెడ్డి సంచికలో పుట 393 కోరుకొండసీమ సస్య సంభరితమై నివాసయోగ్యమైన స్థానము శత్రువులకు సులభముగా చొరుటకు వీలులేని వనదుర్గ మని చెప్పవచ్చును. కాకతీయ చక్రవర్తులకు పూర్వకాలమునుండియు–ఇది యొక నాయంకరముగానుండి సిద్దేశ్వరము కోట యను నగరము రాజధానిగా గోదావరీ తీర మంతయు కోనసీమ సహా నాయకులచే పరిపాలింపబడుచున్నట్లు స్థానిక చరిత్రలు వాకొనుచున్నవి. మల్లపదేవుని యనంతరము ఈ సీమ అన్నలదేవునిచే పరిపాలింపబడినది. ఈ అన్నలదేవుని ప్రతాపరుద్రుడు జయించి ఈ సీమ తన రాజ్యములో కలుపుకొనెను. ఈ అన్నలదేవుడు గొప్ప నీతివేత్త–ప్రజారంజకముగా దేశమును పరిపాలించెను. కోరుకొండ సీమలో కొంతభాగము అడవులతో నిండియున్నది. అన్నలదేవు డా అరణ్యములను కొట్టివేయించి రయితులకు ధర్మకవుల్లిప్పించి ఈ సీమను వృద్ధిపరచెను. దీనినానాడు కోటసీమయని ఉదాహరించినట్లు తోచుచున్నదని గలదు.

ఆంధ్రుల చరిత్ర చిలుకూరి వీరభద్రరావుగారు (పుట 322–23) రుద్రమదేవి రెండవ యల్లుడైన అన్నమదేవ భూపాలుడు - అనుమకొండకు తూర్పున సింహాచలమువరకునుండు దేశమును తన యన్నయగు కొలని రుద్రమనాయని సహాయముతో జయించి రుద్రమదేవికి దక్షిణ భుజమై యొప్పుచుండెడివాడు. ఇతడు సూర్య వంశజుడని చెప్పబడియె.

విజయవాటికయందు లిఖింపబడిన యొక శాసనములో నొక, అన్నలరాజు పేర్కొనబడియె. అందతడు గోదావరికి వంతెన కట్టించెనని చెప్పబడినది.

ఆసీదన్నల దేవేంద్రో దాసీకృత ధరాపతిః।

సేతుం బబంధ గొదాయా యా తుంగ జలవీచికా।

అన్నమదేవ భూపాలుడు రాజమహేంద్రవర ప్రాంత ప్రదేశమును ముప్పది సం. పరిపాలన చేసెనని స్థానిక చరిత్రలందు చెప్పబడినది–కాబట్టి పై శాసనములో పేర్కొనబడిన అన్నలరాజును స్థానిక చరిత్రములందు చెప్పబడిన అన్నమదేవ భూపాలుడును భిన్నులుకాక యొక్కరేయనియు ఆయన రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తికి బినతల్లియగు రుయ్యాంబపెనిమిటి యగు ఇందులూరి అన్నదేవభూపాలుడనియు విశ్వసింపవచ్చును. ఇతనికి సంతానము లేనందున నితని యనుమతి గైకొనియే రుద్రమదేవి తన పెద్ద కుమార్తె పుత్రుడగు శ్రీ వీరప్రతాప రుద్రదేవునకు పట్టముగట్టెను అని చెప్పిరి.

**Madras District Gazetters - Godavari 1915 Page 242.**

**A fort was built in Koti by an early Reddy chief named Annala Deva. The Ms. goes on to Vuote a local Inscription at the end of the eighteenth Century. Which recorded the revenue arrangments made in the village by the Kakatiya king Pratapa-Rudra who reigned till 1324**

పై విషయములను పరిశీలించిన–అన్నలరెడ్డి అన్నలదేవుడు, అన్నమదేవ భూపాలుడు, అన్నలరాజు మున్నగు నామధేయముల

కన్పటు చున్నారు. ఇందులో గోదావరీ ప్రాంత పాలకుడైన అన్నలదేవుడెవరని ప్రశ్న.

ఆంధ్రసర్వస్వములోని అన్నలరెడ్డి 1300 వరకే యున్నట్లు చెప్పబడినది. గాని మిగిలిన వివరము లేమియు లభ్యమగుటలేదు. రెండవ ప్రతాపరుద్రుని కాలములో లేదు.

రెడ్డి సంచికలోని అన్నలదేవుడు–రెండవ ప్రతాపరుద్రునిచే జయింపబడినవాడు. కాని ప్రతాపరుద్రునికి–అన్నలదేవునికి విరోధమున్నట్లు చరిత్ర లభ్యముకాలేదు. వీరుకాక–సివిరి అన్నయమంత్రి ప్రతాపరుద్రుని సోదరుడు. అన్నలదేవుడు–పలివెల కొప్పేశ్వరస్వామి ఆలయ శాసనములో నుదాహరింపబడిన కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు ప్రధాన మంత్రి అన్నయప్రగడ- ప్రతాపరుద్రుని సేనానాయకుడు–అన్నలరెడ్డి– వీరెవరును గోదావరీప్రాంత పాలకులు కారు కాన వీరుకారు...

గోదావరికి వంతెన నిర్మాత–అన్నలదేవుడు. ఆ అన్నలదేవుడు... ఇందులూరి అన్నయమంత్రియే–

కొలని రుద్రుని శివయోగసారములో –

1 కాకతిరుద్రాంబ గాదిలిసుతయైన

2 రుయ్యాంబ పెండ్లాడి రూఢికెక్కి

అని వర్ణింపబడుటనుబట్టి ఇతడే కాకతి గణపతిదేవుని పుత్రిక–రుద్రాంబ–చాళుక్య వీరభద్రుల కుమార్తె–రుయ్యాంబ భర్త–ఈతని ప్రతాపము.

నొప్పి తురకల గెలిచి ప్రతాపరుద్ర
మనుజ నాయకుకోట నేమరక కాచె
ననుచు బొగడంగ నెగడె నియ్యవని నిందు
లూరి యన్నయదేవు డనూనబలుడు–అని వర్ణింపబడినది.

ఈ అన్నలదేవుడే పాల్కురికి సోమన శిష్యుడగు సోమనాథు కోరికమీద ప్రతాపరుద్రునికి చెప్పి శైవులకు డోకిపఱ్ఱు అను గ్రామమును అగ్రహారముగా ఇప్పించెనని పిడపర్తి సోమనాథుని బసవ పురాణములో గలదు.

చ॥ అకుపిత రుద్రమాంబకు నా బొగడొందు ముమ్మడ
మ్మకు మహదేవరాజునకు నాత్మజుడైన ప్రతాపరుద్రుడా
సకల మహీధరంబును వెసన్ దనయంత వహించి దాల్చె నా
యక మహిమంబులన్ దీరిచె యన్నయదేవుడు రుద్రదేవుడన్

ఇందులూరి అన్నయమంత్రియే కాకతి గణపతిదేవుని కాలములోను, రుద్రమదేవి కాలములోను, రెండవ ప్రతాపరుద్రుని కాలములోను కాకతీయులకు దక్షిణ భుజమువలె సహాయపడినట్లు వెల్లడియగుచున్నది. ఈ అన్నలదేవుని కాలములోనే మహమ్మదీయులు ఓరుగల్లుపై మూడుసార్లు దండెత్తి ఓడిపోయిరని చెప్పబడినది.

ఇట్లుండ రెండవ ప్రతాపరుద్రుడు గోదావరీ తీరప్రాంత మగు రాజమహేంద్రవరమును- కోరుకొండను -కాకతీయ సామ్రాజ్యమును కాళింగుల యొత్తిడినుండి సంరక్షించుచున్న -దక్షిణ కళింగాధిపతియగు అన్నలదేవుని చరిత్రకారులు నుడివినట్లు జయించి ఏల తన రాజ్యములో కలుపుకొనెనో వెల్లడికాకున్నది.

అన్నలదేవుడు, ప్రతాపరుద్రుడు బాంధవ్యములు కలవారు. అన్నలదేవుడు కాకతీయ సామ్రాజ్యహితైషి. విశ్వాసపాత్రుడు, తురకల గెలిచి ప్రతాపరుద్ర మనుజనాయకు కోట నేమరక రక్షించినవాడు. ఈ విషయమునే కోరుకొండ–శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి దిగువ కళ్యాణ మండపస్తంభమునందలి శిలాశాసనమును బట్టి–

శ్రీ శకవరుషంబులు 1244 క్రీ. శ. 1322 అగునేంటి

దుందుభి సం. పుష్య శుద్ధ ౧౦ గు/ స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజులు గోదావరి తూర్పునను—కోనమాడల..గాను—అన్నలదేవని యేలిన దేశములకు ఇచ్చిన......

అన్నలదేవని నుండి చొప్పనను

అని చెప్పబడి యుండుటంబట్టి 1322వరకు ప్రతాపరుద్ర—అన్నదేవులకు వైరములేదనియే స్పష్టమగుచున్నది. రుద్రమదేవి యనంతరము ప్రతాపరుద్రుడు సామ్రాజ్యమున పరిపాలనా భారము వహించి నంతనే తన యాధిపత్యమునువెల్లడించుటకు దేశసంచారముగావించుచు గోదావరీ తీరమును చేరియుండ దండయాత్రగా బావించి అన్నలదేవుని యోడించి వెళ్ళగొట్టె నట్లు భ్రమపడియుందురు. అంతేగాని రుద్రమదేవి అన్నలదేవుని సంహా సంప్రతింపులలో ప్రతాపరుద్రుని సింహాసనమెక్కించియుండ అన్నలదేవుడు విరోధము వహించుట కాని ప్రతాపరుద్రుడు దండెత్తి జయించుట గాని జరిగియుండదు పై ఆధారములనుబట్టి కోరుకొండలోని అన్నలదేవుడు, ఇందులూరి అన్నలదేవుడనియే భావింపవలసి వచ్చుచున్నది.

— శ్రీ ముండు విష్ణ్వేశ్వరం శాస్త్రి

# లేఖలు

## శ్రీ సున్దర పాణ్డ్య కృతి

అర్యా,

'నీతి ద్విషష్టిక' అను పేరున—శ్రీ రామకృష్ణకవిగారు తొలిసారిగ 1928లో సాహిత్య సహృదయులకు పరిచయము చేసిరి దీనికే 'ఆర్యాద్విషష్టిక' అనియు నామాంతరము కలదు. తిరువనంతపుర వ్రాత ప్రతి గ్రంథాలయమున గల తాళప్రతిలో ౧౦౮ ఆర్యలున్నవి. ఆ ప్రతిలో దానిపేరు 'ఆర్యావళి'. దీని కర్త 'సున్దర పాణ్డ్యరాజు.

ఈ 'పరమ సుందరకృతి' సంస్కృత—ఆన్ధ్రసాహిత్య రసలోలులకు పరిచయ మగునట్లుల కనిపించదు. కొంతమందికి దీని ఉనికి తెలిసియున్నను ఔదాసిన్యము వహించుట చిత్రము. 1970లో శ్రీ రా అనంతకృష్ణశర్మగారు మాత్రమే, తమ సహజశైలీ విన్యాణముతో దీనిని తెనిగించిరి.

దీని కర్తయగు 'సున్దరపాణ్డ్య' క్షితీశుడు దాక్షిణాత్యుడగు ద్రావిడరాజు కానోపు. ఇతనికాలముకూడ అనిశ్చితమే. పంద్రెండవశతాబ్దివాడగు సూర్యపండితుడు 'కులశేఖర సూక్తిరత్నహారము' అను సంకలన గ్రంథమున ఇందలి ఆర్యలను కొన్ని సంగ్రహించి, సుందర పాండ్య కృత మనియే తెల్పెను.

క్రీ. శ. ఐదవ శతాబ్దినాటి వాడగు విష్ణుశర్మ తన పంచతంత్రమున మూడు ఆర్యలను స్వీకరించుటవలన, మన కవి ఇంకను ప్రాచీనుడని తోచుచున్నది. పండ్రెండవశతాబ్దివాడగు కృష్ణలీలాశుకకవి 'దైవవ్యాకరణము'నకు పురుషకార వ్యాఖ్య వ్రాసి అందు సుందర పాండ్యుని అన్యత్ర శ్లోకమును పేర్కొనెను.

శ్రీమాన్ సుందరపాండ్యుని శ్రీ ఆదిశంకరులును కుమారిల భట్టును, ఉంబేకాచార్యులును పేర్కొనుటచేత—ఇతడు గొప్ప దార్శనికుడును కూడ ఐ యుండనోపు. తన తొలి ఆర్యయందే 'శ్రుతి స్మృతి ప్రవృత సత్పదార్థజ్ఞః' అని చెప్పకొని శ్రోతలబుద్ధిని వృద్ధి చేయుదునని పల్కుట గమనించ తగ్గది.

ఈ లఘుకృతి నీతికోశము. ముఖ్యముగ సజ్జన-దుర్జన వివక్షత స్పష్టముగ నిర్వహించుట గమనించగలము. శుష్కోపదేశ మనుకొనువారు దీనిని కడగంటయైనను చూడరాదు. సార్వకాలిక సత్యములు చిక్కని భాషలో ఆర్ద్రముగను, హార్దముగను కవితా సౌరభమున పొదిగి మనకు ప్రసాదించినాడు.

> రజనికరః ఖలు శీతో,
> రజనికరా చ్చన్దనో మహాశీతః
> రజనికర చన్దనాభ్యాం
> సజ్జన వచనాని శీతాని.

అని స్పష్టపఱచినాడు. చందనము కన్న మిగుల చల్లనివియు, సుమములకన్న పరిమళించునవియు అగు ఇతని సదుక్తులు సహృదయ మనోరంజకములు అగుగాక.

ఈ కవి 'సుహృదో రసాయనం జీవలోకస్య'—అని తీర్మానించెను. ఇతని దృష్టిలో మహర్షి ఎటువంటివాడో గమనించండి. "హీనం యస్తు క్షమతే స మహర్షి సమో నరో జ్ఞేయః". లోకమందు విద్వత్తు దుర్లభమట. అందుచేత విద్వయందు పూన్కి వెలయించమని ఈతని అనుశాసనము (ఆర్యా ౦౭)

మృదువుమాట మాట అని అనిపించుకొనదు. విప్రుశ్వరారి పెక్కులు పల్కడు. ఋతము, హితము, గుణము చెప్పవాడు దుర్లభము (అర్యా ౯౬). యాచకుల కియ్యని ధనము నిష్ఫలము. అంతేకాదు లోభివాని సంపద 'కన్యారత్న మివ గృహే...' వంటిది. అది పరుల కొఱకే అని సున్దర పాండ్యుని గాఢ నమ్మకము (అర్యా ౨౭) ఇంకొక చక్కని సూక్తిని పరికింపుడు.

> కోఽన్ధో యో న వినీతః
> కో బధిరో యశ్శృణోతి న హితాని

కో మూఢః కాలే యః
ప్రియాతిథిం నైవ జానాతి

చెప్పవలసినది సూటిగను, సంగ్రహముగను చెప్పుట సుందరపాండ్యుని రచనా విధానము.

ఇందలి భావములు కవిసార్వభౌమ శ్రీనాథునివంటి వారలకు ప్రేలికరము అగుటయే చాలును. ఇక్కవికీర్తికి.

కటు రటతి నికటవర్తీ
వాచాట శ్చిట్టిభో యతస్తస్మాత్
అపసరణ మేవ యుక్తం
మౌనం వా రాజహంసస్య.

భీమేశ్వర పురాణావతారికయందు శ్రీనాథ కవిరాజు తన నైసర్గిక ప్రౌఢిమతో ఇలా అనువదించినాడు —

నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
వదరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైపరాకున్న నెందేనిఁ జనుటయొప్పు.

ఇది యాదృచ్ఛికమయినను కావచ్చును. లేక శ్రీనాథుని అపార సంస్కృత కావ్య ప్రపంచపు పరిచయమునందలి భావ మైనను కానోపును.

'కేయూరబాహు' కావ్యకర్తయగు మంచెనయు ఒక ఆర్యను తెనిగించి తన ప్రబంధమునందు చొప్పించిన తీరును గమనించండి. ఇది అక్షరానువాదముగాక భావము ఛాయానువాదముగ గ్రహింప బడినది.

పాషాణేష్వివ రేఖా
మూర్ఖేవైరం దృఢం చిరం భవతి
జలమధ్యేష్వివ రేఖా
ప్రాజ్ఞే న చిరం భవతి వైరం.

మంచెనకవి అనుకరణ —

చెలిమి శిలాక్షర మెప్పుడు
నలుక జలాక్షరము సుజను లగువారలకున్
చెలిమి జలాక్షర మెప్పుడు
నలుక శిలాక్షరము కుజను లగువారలకున్.  3-౮౯.

సక్రమమగు జీవన మార్గమునకు నీత్యుపదేశకము రాచబాట. జీవితము కట్టుదిట్టములులేక పట్టు పగ్గములు లేక ఇష మెచ్చిన రీతిని కడపుట అంత సంభావ్యమైనదికాదు. ఎంతటి విశృంఖల మయిన జీవనమునకైనను మితిని నేర్పునది నీతి. క్రింది ఆర్యయందు ఉత్తమ, మధ్యమ, అధముల గూర్చిన ఉపమానము నైసర్గికము. కవికి ప్రకృతి ప్రతీక కాబోలు.

పనసామ్ర పాటల సమాః
స్ఫురి హోత్తమ మధ్యమాధమాః పురుషాః
ఫల సుమఫల సుమనిచయైః
కర్మ వచః కర్మ వాఙ్నిచయైః  (ఆర్యా ౬౭)

ఈ ఆర్యను సకల నీతి కథానిధానము కర్త కూచిరాజు ఎఱ్ఱన (క్రీ. శ. 1500) ఇలా విస్తరించి తెనిగించెను.

పనస, రసాల పాటలుల
పాటిగ నుత్తమ మధ్యమాధముల్
వినబడు చుంద్రు పూయక ఫ
లించియుఁ, బూచి ఫలంబునొందియున్,
ననిచి ఫలంబుఁ బూనక వి
నాశముఁ బొందిన యటి పోలికన్
మును ఫలమిచ్చి, పూచి, ఫల
ముల్పటించియుఁ బూచి పండకన్.  ౪ ౧౦౫

ఇట్టి లోకోత్తర లఘునీతికావ్యమునకు సుగృహీత నాములు ఆచార్య రాఘవన్‌గారు సంశోధిత ముద్రణ వెలయించనున్నారు. వారి విపుల వ్యాఖ్యలో ఎన్నియో విషయములుండుట తథ్యము. కాబట్టి వారి ముద్రణను నిరీక్షించుచు ఇంతటితో విరమించు చున్నాను

— శ్రీ ఐ. యస్ బాబా

* * *

"కవులెప్పుడూ అనుచరులే" అన్న శ్రీ తిరుమల రామచంద్ర గారి వ్యాసం చదివిన పిమ్మట నేనీ మాటలు చెప్పదలిచాను. సహృదయంతో పరిశీలించగలరు.

మార్పు లేనిదంగా జరిగినా, సంఘం కోరుకొనేదెప్పుడూ చైతన్యం. ఈ చైతన్యం అనేక పద్ధతులద్వారా కల్గుతుంది. దార్శనికుడు తన ఆచరణతో ప్రజలను అంగీకరింపచేసి మార్గ దర్శకు డౌతాడు. కొందరి కీ విధానం నచ్చదు. తమ అంతరాలను కదిలించ గలిగేలా తెలియ జెప్పాలి. కవికి నిజమైన అర్థం, రూపం శ్రీ రామ

చం(ద్రగారు పరిగణనలోకి తీసుకొన్నవారు కారు కవి కల్పనలో జీవిస్తాడు. సంఘాన్ని సంస్కరించుదామనే కోర్కె, తపన అతనివి కావు. వారి కాపాదించే విమర్శకులది.

కవిత్వం కవిలోనున్న స్పందనలకు (ప్రతిరూపం. దార్శనికుడు దూరదృష్టితో పరిణామాలను పరిశీలించే జ్ఞాని అని రామచం(ద్ర గారంటే, కవి అందనిదానికై అర్రులుజాచే ఆశాజీవి, యుగాంత రాలలోకి తొంగిచూచే మేధావి, తానునుభవించిన, అనుభవిస్తున్న స్పందనలను తెలియజెప్పే తపస్వి అని నేనంటాను. నిజానికి ఇవి రెండూ పాక్షికమైన ఆలోచనలే!

కవి, దార్శనికుడూ—వీరిరువురూ ఒకే విషయాన్ని రెండు దృక్కోణాలలోంచిచూచే వ్యక్తులు. కవి ఎంత కల్పనలో జీవించినా సమకాలిక సంఘటనల చిహ్నలు (ప్రతిఫలిస్తూనే వుంటాయి. దార్శనికుడు ఎంత సంఘాన్ని సంస్కరిద్దామనుకున్నా, స్వార్థాన్నిమాత్రం మరచిపోడు. దార్శనికుని దృష్టి కేవలం సంఘ పరిణామాలకే పరిమితం. అది (హ్రస్వం. కవి దృష్టి అనంతం. అవధులూ, పరిణామాలు, పరిధులూ—శూన్యం. కళ్లీ కృష్ణుని అందం అతి సుందరంగా కన్పడినదన్న కవిఅనుభవం కాదనటానికి ఏదార్శనికునికీ, శాస్త్రజ్ఞునికీ-అర్హతా, అధికారం లేవు. కారణం అది అతని అనుభవం కావటమే.

గాంధీజీని రామచం(ద్రగారు (ద్రష్టయైన మహాజ్ఞాని అని అంటే, పూర్తి అవకాశవాది, స్వార్థపరుడు-అన్నవ్యక్తులూ లేక పోలేదు. నిజమైన నిజాన్ని తెల్సుకోవాలంటే, నిష్పాక్షికాలోచన కావాలి. దార్శనికులూ, రాజులూ, అధికారులూ, కవిని కొంత పరిధిని దాటి పైకి రానివ్వరు. తమ (ప్రత్యేకతను, గుర్తింపును నిలబెట్టు కోవటంకోసం-కవులను తమ స్వార్థాలకు వాడుకుంటారు. గతిలేని కవులకు, వారిని పొగడక తప్పదు, బలవంతపు కవిత్వం (వ్రాయకా తప్పదు. అది బలవంతం మూలంగా కల్గిన బలహీనత—హీనత మాత్రంకాదు (శ్రీ రామచం(ద్రగారివంటి పెద్దల విమర్శనాపటిమను ఈ విధంగా (హ్రస్వం, సంకుచితం చేసుకోవలదని మనవి.

— శ్రీ విద్యా చక్రవర్తి.

* * *

ఆర్యా!

మార్చి "భారతి" లో "బాలవ్యాకరణము – (త్రిలింగలక్షణ శేషము" అను నా వ్యాసమున (పొరట 30)

"ఆ ఘంటాపథ వ్యాఖ్యాతయే అన్వాదుల కించుక్కు పరంబగు నపుడు పుగాగమంబగు; మానునకు విభాషనగు" నను సూత్రమును వివరించుచు "అను మొదలగు ధాతువుల కించుగాగమము పరమగుచో పుగాగమము విభాష నగు" నని యర్థము చెప్పిరి.

యని ముద్రిత మయ్యెను. వివరించుచు—అనుదాని తరువాత నున్న వాక్య మసంపూర్ణము. అది

"అను మొదలగు ధాతువుల కించుగాగమము పరమగుచో పుగాగమము నిత్యముగ నగును; మాను ధాతువునకు ఇంచుగాగమము పరమగుచో పుగాగమము విభాషనగు" నని యుండవలయును. అసంపూర్ణముగా "భారతి" లో అచ్చయిన వాక్యము ఆ సందర్భమున వెలితిగా నుండుటయేకాక నాయాశయమునకు విరుద్ధముగా నుండును. వ్యాఖ్యాతృ నభి(ప్రాయమునకు వికృతరూప మగును.

"(క్రోధాత్ భవతి స్సమ్మోహః"

అని యున్నదేమో యని (భ్రాంతిపడుట కవకాశ మున్నది, ఆ శ్లోక పాదము "(క్రోధాత్ భవతి సమ్మోహః" అని యుండవలయును.

— శ్రీ నాగిళ్ల గురు(ప్రసాదరావు.

## బుచ్చయ్య పంతులు

సంఘసంస్కర్త అయిన కందుకూరి వీరేశలింగంగారి సమకాలికుడై (బ్రహ్మసమాజ సిద్ధాంతాలను (ప్రచారం చేయడంలో (ప్రముఖ పాత్ర వహించిన బుచ్చయ్య పంతులుగారి జీవితవిశేషముల పైన నాకు, వివరణ కావలెను. దక్షిణ దేశ సంఘసంస్కర్తలు (South Indian Social reformer's) అన్న నా పరిశోధన నిమిత్తము పై వివరణ కావలెను. తెలిసిన విజ్ఞులు, భారతీ పత్రిక ద్వారా నాకు తెలిపిన, నేనెంతో కృతజ్ఞుడను.

— డా॥ మానూర్ మురళీధర్.

రిసర్చ్ ఏసోసియేట్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ సివిక్స్ అండ్ పొలిటిక్స్, యూనివర్సిటీ ఆఫ్ బాంబే, కలీనా, సాంతా(క్రుజ్ బొంబాయి.

# గ్రంథ విమర్శలు

## శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రమ్

శ్రీ శంకరభగవత్పాద భాష్యానువాద సహితము. అనువాదకులు : శ్రీ పాతూరి సీతారామాంజనేయులు, ఎం. ఏ. డెమ్మీసైజు 160 పుటలు. వెల రూ. 5–60.

వ్యాసమహర్షి ప్రోక్తమైన విష్ణు సహస్రనామస్తోత్రం సుప్రసిద్ధమై బహుళ ప్రచారంలో ఉన్నది. చాలామంది ఆస్తికులకు ఇది కంఠస్థం కూడాను. చాలామంది దీనిని నిత్యం పారాయణ చేస్తారు. దీనికి శ్రీ శంకర భగవత్పాదులు రచించిన భాష్యం కూడా ఉన్నది. ఈ స్తోత్రం సహస్రనామాల అర్థంతో కూడా ఇదివరలోనే కొందరు విద్వాంసులు ప్రకటించారుగాని, శంకరభాష్యానువాదంతో సహా ఎవరూ ప్రకటించినట్లు లేదు.

శ్రీ శంకరభగవత్పాదుల ప్రస్థానత్రయభాష్యాలు బ్రహ్మైక్య సిద్ధాంతాలన్నీ, నిర్గుణోపాసననూ ప్రతిపాదిస్తున్నవి. నిర్గుణోపాసన అందరికీ సులభసాధ్యం కాదు. సులభమైన సగుణోపాసనకే జనులలో ఆదరం ఎక్కువ. సగుణోపాసనద్వారా నిర్గుణోపాసనకు దోహదం కూర్చాలనే ఉద్దేశం శ్రీ శంకరులకు ఉండడంవల్లనే ఆయన సగుణోపాసకులకు ప్రధానమైన విష్ణుసహస్రనామస్తుతికి భాష్యం రచించారు. సంస్కృత భాషలో ఉన్న ఆ భాష్యం సంస్కృతభాషానభిజ్ఞులు తెలుసుకొనలేరు. వారి ఉపయోగార్థము శ్రీ సీతారామాంజనేయులు గారు దాన్ని తెలుగులోనికి అనువదించి ప్రకటిస్తున్నారు.

అనువాదకులు సంస్కృతాంధ్రాలలో సమర్థులైన విద్వాంసులు. ఆంగ్లభాషాభిజ్ఞులు. ఎం. ఏ. పట్టం సంపాదించినవారు. విశేషించి అద్వైతసిద్ధాంతంపట్ల అభినివేశం ఉన్నవారు. ఆయన తీరిక వేళల్లో చిత్తశాంతికోసం ఈ స్తోత్రాన్నీ, ఏతద్భాష్యాన్నీ చదువుకొనేటప్పుడు కలిగిన అనుభూతిని నలుగురితో పంచుకొని ఆనందించాలనే ఆశయం ప్రేరేపించగా ఈ గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తున్నది

అనువాద పద్ధతి కుదాహృతి–

"విష్ణుః; వేవేష్టి; వ్యాపించియుండును; వ్యాప్తి యను నర్థము గల 'విష్ణ్' ధాతువునకు 'నుక్' ప్రత్యయము చేరగా 'విష్ణు' అగును. దేశకాల వస్తువు లనెడి మూడు విధములగు విభాగములును లేనివాడు; ఈ దేశమునందు ఈ కాలమందు ఈ వస్తురూపములో నున్నాడని నిర్ణయింపరానివాడు; 'వ్యాప్య మే రోదసీ పార్థ! క్రాంతి శ్చాప్యధికా మమ, 'క్రమణాచ్చాప్యహం పార్థ విష్ణురి త్యభిసంజ్ఞితః' అని మహాభారతము; శాంతి 341–42 43 'యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' ఈ మొదలగు శ్రుతి బృహన్నారాయణోపనిషత్తునందు గలదు. (13–1–2); 'సర్వభూతస్థ మేకం నారాయణం కారణపురుష మకారణం పరం బ్రహ్మ శోకమోహ వినిర్ముక్తం విష్ణుం ధ్యాయ న్న సీదతి' అని ఆత్మబోధోపనిషత్తునందు గలదు; లేదా విశ–ప్రవేశనే అను ధాతువునకు నుక్ ప్రత్యయము చేరగా 'విష్ణుః' అను రూపమగును. 'యస్మాద్విష్ట మిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః, తస్మాదేవోచ్యతే విష్ణు ర్విశేర్ధాతోః ప్రవేశనాత్' అని విష్ణుపురాణము–3–1–45." (పుట 36)

"ఇది విష్ణుశబ్ద వివరణముగా ఉన్నది. కొన్ని నామములకు విపులమైన వివరణమూ ఉన్నది. మూలమైన శంకరభాష్యంలో ఆ యా శబ్దాలకు వివరించిన అర్థాలకు ప్రమాణాలుగా పెక్కు గ్రంథాలనుండి భాగాలు చూపబడినవి, వాటిని పండితులు మాత్రం అర్థంచేసుకోగలరు. వాటికిన్నీ అనువాదం ఉంటే జిజ్ఞాసువులగు ఇతరులకు కూడా ఎంతో ఉపయోగంగా ఉంటుంది. గ్రంథవిస్తర భీతిచే అనువాదకులు వాటిని అనువదించక విడిచిపెట్టారేమో! కొంత సంస్కారం ఉన్నవారు అర్థం చేసుకుంటారని అభిప్రాయపడి ఉండవచ్చును.

ఆస్తిక మహాజనుల ద్రవ్యసహాయంలో ఇది ముద్రించబడింది. ఆస్తికు లందరూ చదువతగిన గ్రంథం యిది.

దీని ప్రతులకు 'శ్రీ పాతూరి–శేఖరబాబు, ఇంటి నెంబరు 11–449–1; ఆదోని, కర్నూలు జిల్లా' అనే చిరునామాకు వ్రాయవలెను.

— "అంగీరస"

## శ్రీ విమలానంద భారతీస్వామి

### లేక

## వైదికధర్మ వైశిష్ట్యము

విమలానంద భారతీ గ్రంథమాల పంచమపుష్పము. రచన. శ్రీ కారుమంచి–కొండలరావు, బి ఏ. బి ఇడి డెమ్మీసైజు 140 పేజీలు. వెల 4 రూ. ప్రతులకు–శ్రీ కె. కొండలరావు, సంపాద

కుడు, విమలానందభారతి, బావాజీపేట విజయవాడ-3 లేక త్రివేణీ పబ్లిషర్సు, బుట్టాయపేట, మచిలీపట్టణము.

తమిళనాడులోని తిరునల్వేలి జిల్లా కుర్తాళంలో శ్రీ మౌన స్వాములవారు స్థాపించిన సిద్ధేశ్వరీ పీఠానికి మొదటి అధ్యక్షులైన శ్రీ విమలానందభారతీస్వాములవారి సంగ్రహ జీవిత చరిత్రం యిది. శ్రీ స్వామివారు 1950 జనవరి 25వ తేదీనే సిద్ధిపొందారు. వారిని గురించిన యావద్విషయాలనూ బాగుగా ఎరిగిన రచయిత 1969లోనే దీనిని రచించారు. గ్రంథప్రకటన 1975లో జరిగింది.

రచించిన తర్వాత దీనిని ముద్రించడ మెలాగ? అనే సమస్య ఏర్పడగా రచయితమిత్రులు కొందరు 'ఒక పత్రికను ప్రారంభించి దానిలో దీనిని సీరియల్‌గా ప్రకటించడం' మంచిదని సలహా యిచ్చారు. ఆ సలహా ప్రకారం రచయిత 'విమలానందభారతి' అనే పత్రికను ప్రారంభించి అందులో దీనిని ప్రకటించారు. గ్రంథప్రకటనకయి పత్రికను ప్రారంభించడం సామాన్యమైనపనికాదు. కొండలరావుగారు ధైర్యసాహసాలతో పత్రికను ప్రారంభించి కృతకృత్యులు కావడం హర్షింపదగినది. వారు దీన్ని పత్రికలో ప్రకటిస్తూ, ఈ గ్రంథాన్ని ప్రత్యేకంగా వెలువరచగలిగారు.

విమర్శకొరకు పంపబడిన యీ పుస్తకాన్ని చదవడానికి మొదట ఉత్సాహం కలగలేదు. ఎవరో ఒక స్వాములవారి చరిత్ర అని అందులో వారి మహత్తులు వర్ణింపబడి ఉంటాయని మనస్సుకు తోచింది. ముద్రణ కూడా పాఠకులను నిరుత్సాహపరిచే రీతిలోనే ఉన్నది. అందువల్ల నాలుగైదు రోజులు పుస్తకాన్ని చదవలేదు.

విమర్శ వ్రాయక తప్పదుగదా, అందుకు పుస్తకము చదివి తీరవలెనుగదా! అని చదువుటకు ప్రారంభించాను. నే ననుకొన్నట్లు అద్భుతశక్తులు కల మహాయోగి చరిత్రను ఈ పుస్తకం చెప్పలేదనీ, సామాన్యసంసారిగా ఉండి ఆత్మపరిశీలనవలననూ, తననిశితబుద్ధివల్లనూ గ్రంథపర్యవేక్షణవల్లనూ, ఆత్మను గురించిన జిజ్ఞాసవల్లనూ, ఆధ్యాత్మికంగా అత్యున్నతస్థితికి వచ్చిన ఆదర్శయోగిపురుషుని జీవిత చరిత్రను చెప్తున్నదనీ గ్రహించాను.

మహత్తుగల యోగిపురుషుల చరిత్రలనుబట్టి వారి గొప్పతనమే వ్యక్తమవుతుంది సామాన్యులకు వానివల్ల కలిగే ప్రయోజనం చాలా తక్కువ. అట్టి మహనీయుల అనుగ్రహంవల్ల కొందరికి కొంత ప్రయోజనం కలిగితే కలగవచ్చును. వైదిక ధర్మాలపట్లనూ, ప్రాచీనాచారాలపట్లనూ సామాన్య ప్రజలకు ఉండే సందేహాలను తీర్చి వారికి దృఢమైన విశ్వాసం కలిగించేటట్లు ఉండే గ్రంథాలు దుర్లభంగానే ఉన్నవి.

శ్రీ విమలానందభారతి స్వామివారు పూర్వాశ్రమంలో కానుకొలను త్రివిక్రమ రామారావుగారు. సామాన్య కుటుంబానికి చెందినవారు. నిశితమైన ప్రజ్ఞాధురంధరులు. కొంతవరకూ విద్యనభ్యసించి, గృహనిర్వహణంకోసం ఉద్యోగం చేస్తూనే, స్వయంకృషివల్లనే పట్టభద్రులయి కవిత్వం చెప్పగలిగి న్యాయశాస్త్రం చదివినా కళాశాలలోనే ఉపన్యాసకులుగా చేరి పెక్కుమంది విద్యార్థుల ఆదర, గౌరవాలను చూరగొన్నారు. ఆత్మవిద్యను గురించిన గ్రంథాలను విరామంలేకుండా పఠించి, విద్వత్సభలలో వాదోపవాదాలలో పాల్గొని మహనీయుల మెప్పు పొందారు.

తను తాను ప్రశ్నించుకుని సందేహాలు తీర్చుకుని తృప్తిపడి యితరులు వేసిన ప్రశ్నలకు సంతృప్తికరంగా సమాధానం చెప్పడంలో వీరికి వీరే సాటి. ఎట్టి చిక్కుప్రశ్నయినా సులభ పద్ధతిలో తగిన సమాధానం చెప్పగల సమర్థులు వీరు. తన్ను ప్రశ్నించిన వారిచేతనే తమ ప్రశ్నలమూలంగా సమాధానం చెప్పించే నేర్పు కలవారు. వీరి వంటివారు చాలా అరుదు.

సభలకు వీరిని ఆహ్వానించి అవమానించ దలచినవారికీ, ప్రసిద్ధమైన గడ్డుప్రశ్నలు వేసి చిక్కులు పెట్ట దలచిన వారికీ శృంగభంగం అవుతూనే ఉండేది. 'విత్తు ముందా? చెట్టు ముందా?' అనే ప్రశ్నకూ, రామాయణాన్ని గురించిన సందేహాలకూ, 'స్త్రీలకు పురుషులతో సమానత్వం ఉండాలా?' అన్న ప్రశ్నకు మతాంతరులు వేసిన ప్రశ్నలకూ వీ రిచ్చిన సమాధానాలు వీరి యుక్తికీ, నిశితదృష్టికీ నిదర్శనాలు. మన ప్రాచీనాచారాలను, వైదిక ధర్మాచరణనూ సమర్థిస్తూ శ్రీ స్వామి చెప్పిన విషయాలు అందరూ అంగీకరించదగి ఉన్నవి.

రచయిత ఈ గ్రంథానికి 'వైదికధర్మవైశిష్ట్యము' అనే నామాంతరం ఉండడం సబబుగానే ఉన్నది. శ్రీ స్వామిచరిత్రను చదువుతూ ఉంటే వైదికధర్మాలు, వాని విశిష్టత—చరిత్రతోపాటు మనస్సుకు ఎక్కుతూ ఉంటుంది. అక్కడక్కడ ఇచ్చిన స్వామివారి పద్యాలు రసవంతంగా ఉన్నవి.

ఇందులో మతాంతరాలను గురించి కూడా ఉన్నందున సర్వమతస్థులూ దీనిని చదవడం అవసరం. ఇట్టి గ్రంథాన్ని రచించి ప్రకటించిన శ్రీ కొండలరావుగారు అభినందనీయులు. దీనిని ముద్రించేటప్పుడు చక్కగా ముద్రిస్తే ఎక్కువ ప్రచారానికి అవకాశం ఉంటుంది.

శ్రీ బులుసు వేంకటరమణయ్య

## లండన్‌లో ఒక రాత్రి

[కీ॥ శే॥ సజ్జాద్ జహీర్; అనువాదం: ముద్దసాని రాంరెడ్డి; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; ఏలూరురోడ్డు; విజయవాడ-2; 136 పేజీలు; వెల: 4-50]

అభ్యుదయ సాహిత్యోద్యమంతో సంబంధమున్నవారందరికీ సజ్జాద్ జహీర్ ఆప్తుడు. మిత్రులకు 'బన్నేభాయ్'. కిషన్ చందర్, అహమ్మద్ అబ్బాస్, ముఖ్దూం, ఫైజ్ అహమ్మద్ ఫైజ్, శ్రీశ్రీ వంటి అభ్యుదయోద్యమ నేతలలో సజ్జాద్ జహీర్ ముఖ్యుడు. అంతే కాక అభ్యుదయోద్యమ చరిత్రను 'రోష్నాయ్' అనే పేరులో సజ్జాద్ జహీర్ రచించారు. "'రోష్నాయ్' అనేది పార్శీపదం. దీనికి రెండర్థాలు. ఒకటి 'కాంతి', రెండు 'సిరా'." వివిధ సాహితీ ప్రక్రియలలో జహీర్‌కు అభినివేశం ఉన్నా ప్రధానంగా ఆయన కవి. 'పిఘ్లా నీలం' (కరిగిన ఇంద్రనీలం) ఆయన రచించిన ఉర్దూ కావ్యం.

విద్యార్థిగా లండన్‌లో ఉన్నప్పుడు సజ్జాద్ జహీర్ అభ్యుదయ రచయితల సంఘాన్ని అక్కడకూడ పాదుకొల్పారు. లండన్‌లో విద్యార్థిగా గడిపిన జీవితానుభవాలను రంగరించి 'లండన్‌లో ఒక రాత్రి' అనే పుస్తకాన్ని రచించారు. అక్షర తోరణాన్ని రచించిన శ్రీ దాశరథి "దీన్ని నవల అనడంగానీ, పెద్దకథ అనడంగానీ ఎంతవరకు సమంజసమో చెప్పలేదు" అంటున్నారు. ఈమాట యథార్థం. లండన్‌లోఉండి ఐ. సి. యస్. పరీక్షకు చదివే భారతీయ విద్యార్థుల జీవిత చిత్రణ మిందులో వుంది. దీనిని శ్రీ ముద్దసాని రాంరెడ్డి అనువాదం చేశారు. శ్రీ రాంరెడ్డి ఒక దురదృష్టకరమైన ఏక్సిడెంటు వలన వికలాంగుడైపోయి, సాహిత్యాభిమానాన్ని మాత్రం విడిచిపెట్టక, రచనలు చేస్తున్న విశిష్ట వ్యక్తి. శ్రీ సజ్జాద్ జహీర్ రచనలు ఎన్నో ఉండగా లఘురచన అని చెప్పదగిన దీనిని శ్రీ రాంరెడ్డి విందుకు ఎన్నుకున్నారో తెలియదు. బహుశా రాంరెడ్డి గారి అనారోగ్యంవలన తేలికపాటి రచననే ఎంచుకున్నారేమో తెలియదు. ఈ పుస్తకం మాత్రమే చదివిన వారికి శ్రీ సజ్జాద్ జహీర్ గొప్పదనం అంతగా గోచరించదు.

'ఆజమ్' అనే యువకుడు 'జీన్' అనే తన ప్రియురాలికోసం పడే ఆవేదన, ఆమె అతడికి అందీ అందక దూరం కావటమూ ఒక పథ మైన కథ. సారాయి కొట్లలో విద్యార్థులు కలుసుకొని వివిధ విషయాలను మాట్లాడుకొనేవారి జీవిత చిత్రణ మరొకవైపు సాగింది. ఆనాడు భారతదేశంలో ఎందరో స్వాతంత్ర్యోద్యమపు రథ చక్రాలకింద పడి నలిగిపోతూ వుండగా తాము విలాసమయజీవితాన్ని గడపటానికి ఇష్టపడక ఏవిధంగానైనా తమ దేశీయులకు తోడ్పడాలనుకునే కొందరు విద్యార్థుల ఆరాటాన్ని రచయిత బాగా వర్ణించారు. భారతీయ విద్యార్థులను చూసి, వాళ్ళను రెచ్చగొట్టే విధంగా, సారాయికొట్లలో భారతీయుల్ని నిందించే త్రాగుబోతుల ప్రవర్తనను చక్కగా ప్రదర్శించారు. ఎవరో ఒక విద్యార్థి గదిలో కలుసుకొని, కబుర్లతో, త్రాగుడుతో, పాటలతో, డాన్సులతో కాలాన్ని వ్యయం చేయటాన్నికూడ నేర్పుగా రచించారు. రాత్రిజీవితాన్ని గడపటంలోని రమ్యత్వానికి అలవాటుపడి నిరర్థకమైన జీవితాలను వెళ్ళదీసే యువతీ యువకుల కథే 'లండన్‌లో ఒకరాత్రి'.

1935 ప్రాంతాలలో భారతీయ విద్యార్థులు లండన్‌లో ఏవిధంగా మెలిగిందీ, ఏ ఆశలతో, ప్రేమలలో, వ్యసనాలలో, నిర్లిప్తతలో, ఆందోళనలో, జీవించినదీ వర్ణించటంలో రచయిత కృతకృత్యులయ్యారు. అంతకు మించిన ప్రయోజనాన్ని రచయిత ఉద్దేశించినట్లు లేదు ఇది చదివాక కథనుగాని, నవలనుగాని చదివిన అనుభూతి కలుగదు. పాతసంగతులను, ఆనాడు లండన్‌చేరిన యువకుల జీవన విధానాన్ని తెలుసుకున్న సంతృప్తిమాత్రం మిగులుతుంది. శ్రీ రాంరెడ్డి అనువాదం సరళంగా సాగి చదివించేదిగా వున్నది.

## లైఫ్ ఇన్ ఎ కాలేజ్

[రచయిత: నవీన్; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; ఏలూరు రోడ్డు; విజయవాడ-2; 279 పేజీలు; వెల: 9 రూ.]

పత్రికలలో కథలు చదివేవారికి 'నవీన్' పేరు పరిచితమైనదే. 'అంపశయ్య' అనే నవల చైతన్య స్రవంతి' పద్ధతిలో వ్రాసి ప్రసిద్ధి పొందారు. వివిధ పత్రికలలో వచ్చిన 13 కథలు 'లైఫ్ ఇన్ ఎ కాలేజ్' అనే సంపుటంగా ప్రచురించారు. కాలక్షేపానికి మాత్రమే పత్రికలు

చదివేవారి సంగతెలా ఉన్నా; కథానిక రూపురేఖలను పరికించేవారికి శ్రీ నవీన్ కథన శిల్పం మరొక్కసారి చూడాలనిపిస్తుంది. సీరియస్‌గా కథలను గురించి ఆలోచించేవారికి నవీన్ చేస్తున్న జీవిత వ్యాఖ్యానాలు సరియైనవిగా తోచవు. కడలిగంభీర మైన జీవితాన్ని నవీన్ కథలు తెలియ చెప్పవు. కాని చదివించే గుణం శ్రీ నవీన్ రచనల్లో ఉన్నది. అది కొన్నిచోట్ల పేలవంగానూ, అవసరంలేనంత పొడవుగా సాగి, శిల్పదృష్టికి లోపంగానూ తోస్తుంది.

ఈ సంపుటంలో 'కసి', 'పేదవాడిపెళ్ళాం'; 'వేట', 'క్లబ్బు'; 'హత్య' కథలు చెప్పుకోదగ్గదిగా ఉన్నాయి. 'కసి' కథలో త్రాగుబోతు తండ్రి చేస్తున్న ఆగడాలు భరించలేక, తండ్రిని చంపేద్దామన్న కోపం వస్తుంది ఒక రిక్షాలాగే యువకుడికి. త్రాగుబోతు తన భార్య తల పగలగొడ్తాడు. కొడుకు తండ్రిదుర్మార్గం భరించలేక అన్నంలో 'ఎండ్రిన్' కలిపి, తండ్రి దానిని తిని చచ్చిపోతాడని ఎదురుచూస్తూంటాడు. తండ్రి నిజంగానే ఎండ్రిన్‌వల్లనే చచ్చిపోతాడు. ఐతే అది కొడుకు అన్నంలోకలిపిన ఎండ్రిన్‌వల్లకాదు. తన భార్యను కొట్టిన తరువాత, డబ్బుబలవంతంగా తీసుకుపోయి సారాదుకాణంలోయిచ్చి, సారా పొయ్యమంటే, దుకాణంవాడు అదంతా పాతబాకీకింద చెల్లు బెట్టుకొని, ఎదురు తిరిగినందుకు వాడి మనుషులతో తన్నించి చెత్త కుండీలో పారేయిస్తాడు. తన జీవిత మేమిటో గ్రహించిన తరువాత అతడు స్వయముగానే ఎండ్రిన్ తాగి చచ్చిపోతాడు. అతని చావుకు కారణం స్వయంకృతమా? త్రాగుడా? కాదు, ఈ పరిస్థితులే, యీ సమాజమే — ఇవి మారితే అటువంటి చావు లుండవని 'నవీన్' యీ కథలో నేర్పుగా సూచించారు.

'పేదవాడి పెళ్ళాం' కథలో ఒక ఆఫీసర్ తన దగ్గర పనిచేసే రంగడి భార్య రాధితో అక్రమ సంబంధం పెట్టుకుంటాడు. రంగడు తన కన్యాయం చెయ్యొద్దని భార్యను బతిమాలుకొంటాడు. తన నెదిరించ వచ్చిన రంగణ్ణి తన్నిస్తాడు ఆఫీసర్. కిరసనాయిల్ పోసు కొని తనను, ఇంటినీ తగలబెట్టుకొంటాడు రంగడు. అవినీతిపరు డైన ఆఫీసర్ ప్రవర్తన అసహజం కాదు కాని యీ కథలో శిల్ప లోపం బాగా కన్పిస్తున్నది. ప్యూన్ భార్యపేరు రాధి అని ఉండటం అసంభవంకాదు కాని వింతగాఉంది. కొత్తగా కథలు వ్రాయటం మొదలుపెట్టినవారి శైలిలాగ ఉంది కథ.

భార్యను అనుమానించేవాడికి అంతకన్నా శిక్ష ఇంకేమీ అక్కర లేదు. తల్లి ఎవరితోనో లేచిపోతే, తండ్రి స్త్రీ అంటే విరక్తిచెంది "ఆడదాన్ని-ముఖ్యంగా అందమైన ఆడదాన్ని చచ్చినా నమ్మకు" అని సందేశమిచ్చి చచ్చిపోతాడు. కథకుడు తన భార్యను నమ్మలేక చీటికి మాటికి అనుమానించి, ఆమెను చిత్రహింసపెట్టి తానూ చిత్ర హింస అనుభవిస్తాడు. చివరకు భార్య రంకులాడి కావటానికి తానే కారకుడౌతాడు." అయనఅమ్మ ఎవడితోపో లేచిపోయిందిట...అంద కని లోకంలో ప్రతి ఆడది అమ్మలాంటిదే ననుకుంటాడు" అని చెప్పి అతని భార్య తెగింపు చేస్తుంది. భార్యను హత్యచేసి పోలీసులకు లొంగిపోతాడు. దయనీయమైన ఒకవ్యక్తి మనస్తత్వాన్ని కథలో చక్కగా చిత్రించారు శ్రీ నవీన్.

శ్రీ శ్రీ గారి కోనేటిరావుకు నకలు గుమాస్తా గురవయ్య. కలల జీవి. తన ఆలోచనలలో ఆఫీసర్‌ను అనేక విధాల హింసిస్తాడు. 'హార్ట్ ఎటాక్'తో చచ్చిపోయిన 'ఆఫీసర్'ను తానే చంపాననుకుంటాడు. కథ కొత్తది కాకపోయినా కథనంలో శ్రీ నవీన్ తగినంత నేర్పు చూపారు 'హత్యకథలో.

'క్లబ్బు' కథ ఒక మంచిప్రయత్నం. కాని క్లబ్బు వాతావరణాన్ని నిశితంగా పరిశీలించినట్లులేదు. సినిమాలు చూసి, ఊహించి వ్రాసినట్లుందేగాని సహజంగా లేదు. కేవల వర్ణనే కథకు ప్రాణం కారాదు. కథగా చెప్పుకోదగింది దీనిలో పెద్దగా లేదు. ఏ పాత్రా స్ఫుటంగా చదువరుల మనస్సులలో మెదలదు.

'లైఫ్ ఇన్ ఎ కాలేజీ' కూడ కాలేజి పరిస్థితులను సహజంగా, కళాత్మకంగా ప్రదర్శించటంలేదు. ఊహామాత్రంగా ఉన్నదేగాని చదివే వారి కెటువంటి అనుభూతిని కలిగించదు. 'అనగా అనగా' పద్ధతిలో కథనం చప్పగా వుంది. 35 పేజీల కథలో కాలేజివాతావరణం ఏమాత్రం సహజంగా లేదు. సంక్షిప్తత కవితకే కాదు కథానికకూ అవసరమే. ప్రతి సంఘటనను వివరంగా ఏకరువు పెట్టటంవలన చదువరికి ఆనందం కలుగదు.

ఈ పుస్తకానికి 'ముక్తానుషంగం' అని శ్రీ రాంభట్ల కృష్ణ మూర్తి విపులమైన పీఠిక రచించారు. మనస్తత్వ విశ్లేషణ, చైతన్య స్రవంతి, అబ్‌స్ట్రాక్ట్ కవిత్వం, ఆధునికత, మార్క్సిజం, మొద లైన పెక్కు విషయాలను ప్రాచ్య పాశ్చాత్యదృష్టిలో సమన్వయం చేశారు. నవీన్ కథలలోని చైతన్య స్రవంతి గురించి వివరించారు.

నాలుగు కాలాలపాటు చెప్పుకో దగిన కథ ఏదీ యీ సంపుటంలో లేకపోయినా శ్రీ నవీన్ సామాజిక స్పృహ ఉన్న రచయిత. చేతనా స్రవంతినుండి, భౌతికవాదానికి ప్రయాణిస్తున్న శ్రీ నవీన్ సమాజాన్ని ప్రతిబింబించే ఆనందం కలిగించే కథలు వ్రాయగలరని ఆశించవచ్చు.

—శ్రీ రామమోహనరాయ్

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.